# హైదరాబాదు హిందీ ప్రచార సంఘము

327 రెసిడెన్సీరోడ్డు, హైదరాబాదు

పుస్తక విక్రయశాలలో లభించు తెలుగు పుస్తకములు

తెలుగు భాషాసమితి వారివి :

| | | |
|---|---|---|
| తెలుగు విజ్ఞాన సర్వస్వము (చరిత్ర-రాజనీతి) | | 25-0-0 |
| ,, (భౌతిక రసాయన శాస్త్రములు) | | 25-0-0 |

శ్రీ దాశరథి రచనలు :

| | | |
|---|---|---|
| అగ్నిధార | | 1-8-0 |
| రుద్రవీణ | | 1-0-0 |

శ్రీ సి. నారాయణరెడ్డి రచనలు

| | | |
|---|---|---|
| జలపాతం | | 1-0-0 |
| విశ్వగీతి | | 0-6-0 |
| అజంతా సుందరి | | 0-8-0 |
| నారాయణరెడ్డి గేయాలు (ప్రచురణ, డిసెంబరు 55) | | 1-4-0 |

శ్రీ ఆంజనేయులు గారి రచనలు

| | | |
|---|---|---|
| [illegible] (కె. యం. మున్షీ నవల) | | 1-6-0 |
| [illegible]కన్య (కె. యం. మున్షీ నాటకము) | | 1-4-0 |
| దేవదత్త ( ,, ) | | 1-0-0 |
| గాంధీ-మార్క్స్ (కిషోరీలాల్ మష్రువాలా) | | 1-8-0 |
| ఉర్దూకథలు | | 0-12-0 |

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి రచనలు

| | | |
|---|---|---|
| ప్రజలమనిషి | (నవల) | 2-8-0 |

సోమంచి యజ్ఞన్నశాస్త్రి రచనలు

| | | |
|---|---|---|
| వెట్టిమనుష్యులు | నాటకము | 1- 8-0 |

వావిళ్లవారి ప్రచురణలు

| | | |
|---|---|---|
| గాంధీమహాత్ముడు | | 1- 4-0 |
| చుక్కాని | నవల | 2- 8-0 |
| సింహపురిరాజు | ,, | 1- 4-0 |

ఫోన్ : 4406

టెలిగ్రామ్: [illegible]

సంచిక 3

[illegible] 3

# ప్రవంతి

సాహిత్య మాసపత్రిక

జూన్ 1956

★

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

★

హైద్రాబాదు హిందీ ప్రచార సంఘము

327, రెసిడెన్సీ రోడ్డు — హైద్రాబాదు.

సంవత్సర చందా

రు. 3-0-0

విడిప్రతి

రు. 0-[illegible]

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide. Proceedings Dis No 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో

*సంపాదకీయము :*

# బుద్ధ మహాపరినిర్వాణ జయంతి

బుద్ధ భగవానుని నిర్వాణం జరిగి గడచిన వైశాఖ శుద్ధ పూర్ణిమ నాటికి 2500 సంవత్సరాలు గడచినవి ఆనాడు యావద్భారతదేశమూ మహోత్సాహంతో బుద్ధభగవానుని మహాపరినిర్వాణ జయంతి ఉత్సవాలను జరుపుకొన్నది పీడిత మానవజాతి దుఃఖాశ్రువులను తుడిచివేసి సర్వమానవ సౌభ్రాతృత్వ పథంలో మానవజాతిని నడిపించి విశ్వకళ్యాణమును సమకూర్చిన బుద్ధ భగవానుని స్మరించినంత మాత్రముననే హృదయం ఉప్పొంగి పోగలదు బుద్ధ భగవానుని జన్మచే భారతదేశం పవిత్రమైంది మొదటినుండి ప్రపంచానికి భారత దేశం ఆధ్యాత్మిక జ్ఞానభిక్షను పెట్టినది ఐహిక సుఖములకుగాక ఆముష్మిక విచారణకు ప్రాధాన్యతనిచ్చి మానవుని ఆత్మశాంతికి అవసరమగు మార్గములు అన్వేషించినవారు భారతీయులు బుద్ధభగవానుడు హింసాప్రవృత్తమైన జగతిలో అహింసావాదమును ప్రతిష్ఠింపజేసి వైరమును వైరముతోగాక ప్రేమతో సమయింపజేయవలెనని ఉద్బోధించినాడు ఆ మహాపురుషుని ఉదాత్త సిద్ధాంతములను - బోధలను - జీర్ణించుకొని రాజకీయ జీవితంలో అహింసను జీవిత భాగంగా అనుసరించి భారతజాతిని దాస్యశృంఖలాలనుండి విడిపించి మహాత్మా గాంధీజీ విశ్వశాంతిదూత — ప్రేమదూత కాగలిగినాడు

మహాత్ముని కృషిచే భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నది అయినా మనదేశం నెమ్మది నెమ్మదిగా మహాత్ముని సిద్ధాంతములనే మరచిపోతున్నది జాతిపితను మహాత్మాజీని మరచిపోయే దేశం బుద్ధుని జ్ఞాపకం పెట్టుకొనగలదా ?

అణుబాంబుల యుగం దాటింది హైడ్రోజనుబాంబుల యుగం వచ్చింది విజ్ఞానశాస్త్రం కొత్త కొత్త మారణాస్త్రాలను కనిపెడుతున్నది మారణాయుధ నిర్మాణంతో దుష్టశక్తులు హింసాప్రవృత్తిని ప్రకోపింపజేసుకొంటూ మహానాశనానికి తయారవుతున్నవి పిశాచ నృత్యం చేస్తున్నవి ఈ దుష్టశక్తులనుండి మానవజాతి బయటపడే దెలా ? శాంతిమయమైన వాతావరణాన్ని సృష్టించే

దెలా ? దేశదేశాల ప్రజలు వైరాలూ, విద్వేషాలూ మరచిపోయి సోదరులవలె మెలిగే దెలా ? అందు కేది ఉపాయం ? హృదయమున్న ప్రతివ్యక్తినీ ఈనాడు ఎదుర్కొంటున్న ప్రశ్న లివే. సమస్య లివే కనుకనే ఈనాడు బుద్ధునీ, మహాత్మునీ మనం మరచిపోయే వీలులేదు. అడుగో, గతంలోనుండి బుద్ధభగవానుడు నెమ్మదిగా పిలుస్తున్నాడు, చల్లని శాంతి సందేశాన్ని వినిపిస్తున్నాడు ఆ చల్లని పిలుపును వినడానికి మన శ్రవణాలు ఆతురతను చూపుతున్నవి కొంతకాలంగా విస్మరించి ఆ మహామహుని ఒక్కసారిగా మనం స్మరించుకొంటున్నాము స్వార్థము, అహంకారము, ఐహిక సుఖలాలసత్వము పెచ్చుపెరిగి ఒకజాతి ఇంకొకజాతినీ, ఒకదేశం ఇంకొకదేశాన్నీ, ఒకవ్యక్తి ఇంకొకవ్యక్తినీ పీల్చి పిప్పిచేయవలె ననే తమతమ దురాశలను వదలి, పరస్పర సహకారంతో — ప్రేమతో — ఆనందంగా జీవించి జీవితాన్ని పరిమళవంతం చేసుకొనవలసిఉన్నది. బుద్ధభగవానుని మహాపరినిర్వాణ జయంతి ఉత్సవాలద్వారా ప్రపంచం ఈ సత్యాన్ని గ్రహించగలదని విశ్వసిస్తున్నాము

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి



శిల్ప తోరణము
—అమరావతి

# ధమ్మపదసారము

సంకలనము :
శ్రీ శ్రీనివాస సోదరులు
శతావధానులు.

న హి వేరేన వేరాని సమ్మన్తీధ కుదాచనం
అవేరేన చ సమ్మన్తి ఏస ధమ్మో సనాతనో. ౧-౫

విరోధంచేత విరోధం ఎప్పటికి శమించదు. అది ప్రేమచేతనే శమిస్తుంది. ఇది సనాతన ధర్మం

ఉట్ఠానేన ప్పమాదేన సఞ్ఞమేన దమేన చ
దీపం కయిరాథ మేధావీ యం ఓఘో నాభికీరతి. ౨-౫

ప్రమత్తుడుగాక సదా జాగృతుడై మనస్సును, ఇంద్రియములను లోబరచుకొని ఉండే బుద్ధిమంతుడు మహాసముద్రం ముంచలేని ద్వీపంలాంటివాడు

న తం మాతా పితా కయిరా అఞ్ఞే వాపి చ ఞాతకా
సమ్మాపణిహితం చిత్తం సేయ్యసో నం తతో కరే. ౩-౧౧

పూర్తిగా వశపరచుకోబడిన మనస్సు ఎంత శ్రేయస్సు చేకూరుస్తుందో అంత శ్రేయస్సు తల్లిగాని, తండ్రిగాని, ఇతర బంధువులుగాని చేకూర్చలేరు.

పుప్ఫాని హేవ పచినన్తం వ్యాసత్తమనసం నరం
సుత్తం గామం మహోఘోవ మచ్చు ఆదాయ గచ్ఛతి ౪-౪

పుష్పాలనే, (ఇంద్రియసుఖాలనే) ఏరుకుంటూ, వాటియందే మనస్సు నిలుపుకున్నవాణ్ణి నిద్రపోతున్న గ్రామాన్ని ఉప్పెన ముంచుకపోయినట్లు మృత్యువు లాక్కుపోతుంది.

పుత్తా మత్థి ధన మత్థి ఇతి బాలో విహఞ్ఞతి
అత్తా హి అత్తనో నత్థి కుతో పుత్తా? కుతో ధనం? ౫-౩

'నా పుత్రులు, నా డబ్బు' అని మూర్ఖుడు పరితపిస్తాడు. తనకు తానే లేదే? ఇంక పుత్రు లెక్కడ? ధన మెక్కడ?

ఉదకం హి నయంతి నేత్తికా ఉసుకారా నమయంతి తేజనం
దారుం నమయంతి తచ్ఛకా అత్తానం దమయంతి పండితా ౬-౫

నీటిగొట్టాలు నీటిని ఎటు కావాలంటే అటు తీసుకుపోతాయి బాణాలు చేసేవారు బాణాన్ని కావలసినట్లు వంచుతారు వడ్లవాళ్లు కర్రెను కోరినట్లు చెక్కుతారు. పండితులు ఆత్మను లోబరచుకుంటారు

రమణీయాని అరణ్ణాని యత్థ న రమతీ జనో
వీతరాగా రమిస్సంతి న తే కానుగవేసినో. ౭-౧౦

కామానువర్తులు గాని విరాగులు విహరించేవి జనసామాన్యానికి ఇంపు గాని అరణ్యాలైనా రమణీయంగానే ఉంటాయి

యో సహస్సం సహస్సేన సంగామే మానుసే జినే
ఏకం చ జేయ్యా అత్తానం స వే సంగామజుత్తమో ౮-౪

ఒక్కచేతిమీదిగా వెయ్యిమందిని యుద్ధంలో జయించినవానికంటే ఒక్క తన ఆత్మను తాను జయించినవాడే మిక్కిలి గొప్పవాడు

న అంతలిక్ఖే న సముద్దమజ్ఝే న పబ్బతానం వివరం పవిస్స
న విజ్జతి సో జగతిప్పదేసో యత్థ ట్ఠితో ముంచేయ్య పాపకమ్మా,
౯-౧౨

ఆకాశంమీదికి పోయినా, సముద్రమధ్యంలో దూకినా, కొండగుహల్లో దూరినా ప్రపంచంలో ఏప్రదేశానికి పోయినా పాపం వదలిపెట్టదు.

సబ్బే తసన్తి దండస్స సబ్బే భాయన్తి మచ్చునో
అత్తానం ఉపమం కత్వా న హనేయ్య న ఘాతయే ౧౦-౧

దండమంటే అందరికీ భయమే. అందరూ తనవంటివారే అనుకొని ఎవరినీ కొట్టగూడదు. చంపగూడదు.

కోను హాసో ? కి మానందో ? నిచ్చం పజ్జలితే సతి
అంధకారేన ఓనద్ధా పదీపం న గవేస్సథ ? ౧౧-౧

ప్రపంచమంతా తగలబడిపోతూంటే ఎందుకు నవ్వుతావు ? ఏమిచూసు కొని ఆనందిస్తావు ? చీకట్లో కొట్టుకులాడుతూ కూడా దీపంకోసం వెతుకోవేమి ?

సుకరాని అసాధూని అత్తనో అహితాని చ
యా వే హితఞ్చ సాధుఞ్చ తం వే పరమదుక్కరం ౧౨-౭

తనకు కీడు కలిగించే చెడ్డపనులు చెయ్యటం తేలిక మేలు కలిగించే సాధు కార్యం చెయ్యటం చాలా కష్టం

యోచ పుబ్బే పమజ్జిత్వా పచ్ఛా సో న ప్పమజ్జతి
సో ఇమం లోకం పభాసేతి అబ్భాముత్తో వ చందిమా. ౧౩-౬

మొదట పొరపాటుపడి తప్పుచేసినా తరువాత జాగ్రత్తగా ఉంటే అతడు మబ్బువిడిచిన చంద్రునివలె ప్రకాశిస్తాడు.

అపి దిబ్బేసు కామేసు రతా సో నాధిగచ్ఛతి
తణ్హాక్ఖయరతో హోతి సమ్మాసంబుద్ధ సావకో. ౧౪-౯

సమ్యక్సంబుద్ధుని సేవకుడు దివ్యభోగములయందుకూడా మనస్సు పెట్టడు. కోరికలను చంపుకోటంలోనే ఆసక్తుడౌతాడు.

జయం వేరం పసవతి దుక్ఖం సేతి పరాజితో
ఉపసన్తో సుఖం సేతి హిత్వా జయపరాజయం. ౧౫-౫

విజయం వైరం పెంచుతుంది ఓటమి దుఃఖం కలిగిస్తుంది. ఉపశాంతుడైనవాడు జయపరాజయాలను వదలి సుఖంగా ఉంటాడు

మా పియేహి సమాగచ్ఛి అప్పియేహి కుదాచనం
పియానం అదస్సనం దుక్ఖం అప్పియానం చ దస్సనం. ౧౬-౨

ప్రియులను, అప్రియులను ఏర్పాటుచేసుకోవద్దు. ప్రియులు కనపడకపోతే దుఃఖం, అప్రియులు కనపడితే దుఃఖం.

అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా జినే
జినే కదరియం దానేన సచ్చేన అలికవాదినం. ౧౭-౩

కోపంతోఉన్నవాణ్ణి ప్రేమతోనూ, దుర్మార్గుణ్ణి మంచితనంతోనూ, లోభిని దానంతోనూ, అసత్యవాదిని సత్యంతోనూ జయించాలి.

అయసావ మలం సముట్ఠితం తదుట్ఠాయ తమేవ ఖాదతి
ఏవం అతిధోనచారినం సకకమ్మాని నయంతి దుగ్గతిం. ౧౮-౬

ఇనుమునుండి పుట్టి ఇనుమునే తినివేసే తుప్పు మాదిరిగా దుర్మార్గుణ్ణి అతనికర్మలే దుర్గతికి తీసుకుపోతాయి.

న తేన పండితో హోతి యావతా బహు భాసతి
ఖేమీ అవేరీ అభయో పండితో తి పవుచ్చతి. ౧౯-౩

అతిగా మాట్లాడినంతమాత్రాన పండితుడు కాడు. సహనశీలుడు, ప్రేమ మయుడు, నిర్భయుడు అయినవాడే పండితుడు.

మగ్గా నట్ఠంగికో సేట్ఠో సచ్చానం చతురో పదా
విరాగో సేట్ఠో ధమ్మానం ద్విపదానం చ చక్ఖుమా. ౨౦-౧

మార్గాలలో అష్టాంగమార్గం,* సత్యాలలో చతురార్య సత్యాలు, ధర్మాలలో వైరాగ్యం శ్రేష్ఠమయినవి. మనుష్యులలో సంబుద్ధుడు శ్రేష్ఠుడు.

దూరే సన్తో పకాసేన్తి హిమవన్తో వ పబ్బతో
అసన్తేత్థ న దిస్సన్తి రత్తి ఖిత్తా యథా సరా ౨౧-౧౫

మంచివారు దూరంనుంచికూడా హిమాలయాలవలె కనబడుతుంటారు. చెడ్డవారు చీకటిలో వేసిన బాణాలవలె కనపడరు.

---

*అష్టాంగమార్గం సమ్మాదిట్ఠి (సమ్యగ్దృష్టి), సమ్మాసంకప్పో (సమ్యక్సంకల్పము) సమ్మావాచా (సమ్యగ్వాక్కు), సమ్మాకమ్మంతో (సమ్యక్కర్మ), సమ్మా ఆజీవో (సమ్యగాజీవము), సమ్మావాయామో (సమ్యగ్వ్యాయామము), సమ్మాసతి (సమ్యక్స్మృతి), సమ్మాసమాధి (సమ్యక్సమాధి).

కయిరా చే కయిరోథేనం దల్హ మేనం పరక్కమే
సిథిలో హి పరిబ్బాజో భియ్యో ఆకిరతే రజం —౨౨-౮

చేయదలచినపనిని పూర్తిగాను, పరిశ్రమతోను చేయాలి. సన్యసించి కూడా శిథిలప్రవర్తన కలిగిఉంటే మాలిన్యం వ్యాపింపజేసినవా డౌతాడు.

ఏకస్స చరితం సేయ్యో నత్థి బాలే సహాయతా
ఏకో చరే న చ పాపాని కయిరా అప్పోస్సుక్కో మాతంగ
రఞ్ఞేవ నాగో —౨౩-౧౧

మూర్ఖుడితో చెలిమిచేసిందానికంటే ఒంటరిగా ఉంటం మేలు ఏపాపం చెయ్యకుండా ఒంటరిగా ఉండి, అరణ్యంలో మాతంగజాతి ఏనుగు ఏ బాదర బందీ లేకుండా ఉన్నట్టు ఉండాలి

తిణదోసాని ఖేత్తాని ఇచ్ఛాదోసా అయం పజా
తస్మా హి విగతిచ్ఛేసు దిన్నం హోతి మహప్ఫలం —౨౪-౨౬

పొలాలను కలుపు పాడుచేస్తుంది ప్రజలను కోరిక పాడుచేస్తుంది కనుక కోరిక చంపుకున్నవారి కిచ్చిన దానం ఎక్కువ ఫలిత మిస్తుంది

నత్థి ఝానం అపఞ్ఞస్స పఞ్ఞా నత్థి అఝాయతో
యమ్హి ఝానం చ పఞ్ఞం చ సవే నిబ్బాన సన్తికే —౨౫-౧౩

ప్రజ్ఞలేనివానికి ధ్యానం కుదురదు ధ్యానం కుదురనివాడికి ప్రజ్ఞ కలుగదు. ప్రజ్ఞ, ధ్యానం రెండూ కలవాడే నిర్వాణం పొందగలుగుతాడు

న జటా హి న గోత్తేన న జచ్చా హోతి బ్రాహ్మణో
యమ్హి సచ్చం చ ధమ్మో చ సో సుచీ సో చ బ్రాహ్మణో —౨౬-౧౧

జడలచేతగాని, గోత్రంచేతగాని, జాతిచేతగాని ఎవడూ బ్రాహ్మణుడు కాడు. సత్యం, ధర్మం అవలంబించినవాడే బ్రాహ్మణుడు అతడే పవిత్రుడు.

ధమ్మపదసారము సంపూర్ణము.

శ్రవ్యనాటిక :

# మహాపరినిర్వాణము

—శ్రీ దాశరథి

## ఇందలి పాత్రలు

### పురుషులు

బుద్ధుడు
నందుడు — బుద్ధుని తమ్ముడు, భిక్షువు
మల్లుడు — గ్రామీణుడు
ఆనందుడు — బుద్ధుని ప్రథమానుయాయి
ఉపాలి — ఉపాసకుడు

### స్త్రీలు

కల్యాణి — పూర్వాశ్రమంలో నందుని భార్య
ఆమ్రపాలి — రాజవేశ్య
ఉత్పలవర్ణ — ఉపాసిక

## (ఒకటవ రంగం)

నందు. ఇక్కడికి హిరణ్యవతీనది ఎంతదూరం నాయనా!

మల్లుడు. హిరణ్యవతి! హిరణ్యవతి ఇక్కడికి చాలా దూరం చాలాచాలా దూరం కనీసం ఓ పది యోజనాలయినా వుంటుంది

కల్యాణి అమ్మో! పదియోజనాలే.

మల్లుడు. ఔనమ్మా! అయితే అంత గాబరాపడడం దేనికి మీకు త్వరగా వెళ్ళాలనివుంటే నేను ఏదైనా వాహనం ఏర్పాటు చేస్తాను. అన్నట్టు మీరు ఎవరు, ఎక్కడినుంచి వస్తున్నారు?

నందు: మేమా! మేము బౌద్ధభిక్షుకులం ఈమెపేరు కల్యాణి నేను నందుణ్ణి బుద్ధమూర్తి ఆదేశానుసారం సింహళం వెళ్ళాం, తిరిగి వస్తున్నాం.

కల్యాణి: మాకు ఎందుకో ఓ రెణ్ణెల్లక్రితం మనస్సులో ఒక భీతి పట్టుకుంది అదేమిటంటే బుద్ధమూర్తి చాలా వృద్ధులై పోయినారు ఆయన ఏక్షణాన మనను వదిలేస్తారో అని

మల్లుడు: తల్లీ! బుద్ధమూర్తిని చూడ్డానికే వెళుతుంటే హిరణ్యవతి వైపెందుకూ! ఒకవారం రోజులక్రితం వైశాలి వద్ద మామిడితోటలో స్వామిని దర్శించుకున్నాను.

నందుడు ఆ: నీవు స్వామిని దర్శించుకున్నావా? స్వామి ఎలావున్నారు? ఏమంటున్నారు? చెప్పవూ!

మల్లుడు స్వామి ఆమ్రపాలి మామిడితోటలో వున్నారు ఆయనవెంట ఆనందులవారూ వున్నారు స్వామి చాలా డస్సి వున్నారు వార్ధక్యం ఆయన కనురెప్పలమీద బరువుగా వ్రేలాడుతున్నది. ఆయన కొంచెం మూల్గుతున్నారు. శరీరంలో సత్వంపోయింది. శరీరమంతా నొప్పులు.

కల్యాణి అయ్యో స్వామీ! నా స్వామికి ఎన్నికష్టాలు వచ్చినవి?

మల్లుడు అయినా స్వామి నవ్వుతో ఉత్సాహంగా శిష్యకోటికి ప్రబోధం చేస్తున్నారు. అస్తమిస్తున్న సూర్య బింబంగా ఆయన అత్యంత గంభీరంగా వున్నారు.

నందుడు · అయితే ఇక్కడికి వైశాలి ఎంతదూరం?

మల్లుడు వైశాలి ఓ అయిదారు యోజనాలైనా వుంటుంది అయితే మీకు ఈరాత్రికి వెళ్ళ డానికి వీలుకాదు దారిలో పల్గునది అడ్డుపడుతుంది పైగా వర్షాకాలం, రాత్రిపూట నదులు పొంగెత్తుతాయి మీరు ఈ పూట ఇక్కడే విశ్రమించండి.

కల్యాణి అయ్యో, నా స్వామికి ఈ వారం రోజుల్లో ఏం ప్రమాదం జరిగిందో!

మల్లుడు అమ్మా · బుద్ధమూర్తికి ప్రమాదం జరిగితే క్షణంలో ప్రపంచం అంతటికీ తెలుస్తుందమ్మా! నీవు భయపడకు.

కల్యాణి నాకు జ్ఞానభిక్షపెట్టి, నన్ను తేజోలోకంవైపు మరల్చిన నా స్వామిని ఎప్పుడు దర్శించుకుంటాను

నందుడు కల్యాణీ! నాకూ బెంగగానేవుంది కాని అధైర్యపడితే లాభంలేదు. కామంలో తపించే మన ఇరువురికీ ఉదాత్తమైన అమృతపథం చూపిన స్వామిని చూడకుండా నేనుమాత్రం బ్రతకగలనా? బ్రతకగలనా సుందరీ!

కల్యాణి నన్ను సుందరి అని పిలువకు నాకు గతం జ్ఞాపకం వచ్చి పాడుకూపంలో పడి పోతాను స్వామి పెదవులనుండి ఉచ్చరింపబడిన కల్యాణి అనే పేరే నాకు బావుంటుంది.

నందుడు క్షమించు కల్యాణీ! అయితే మనం ఏనాడో త్యజించివచ్చిన పాతబ్రతుకు మనను చాలా దూరాన వదిలిపోయింది ఇంకా అది మనను వంచించదు పొగలేని అగ్నివలె స్వచ్ఛమైన స్వామి మనలోని చెడునంతా ఎన్నడో కాల్చివేశారు. ఇంకా మనకు భోగకాయంలేదు ఇవి మన ధర్మకాయాలు

మల్లుడు మీరు బుద్ధమూర్తికి చాలా సన్నిహితులుగా వున్నారు,

కల్యాణి · ఈయన స్వామికి తమ్ముడు. నేను

నందుడు ఈమె సాక్షాత్తు మరదలు

కల్యాణి అది పూర్వాశ్రమంలో. ఇప్పుడు మేం బౌద్ధభిక్షువులం. మాకు వరసలు ఇంకా లేవు. మేం పరస్పరం సేవైకజీవులం.

మల్లుడు. శరీరాల్ని జయించగల ఈ మహాశక్తి బుద్ధుని వల్లనే మీకు వచ్చివుంటుంది.

కల్యాణి  మన్మథుణ్ణి జయించినవాడు బుద్ధు డొక్కడే.

నందుడు  భోగకాయంనుండి ధర్మకాయ ప్రవేశం చేయించిన మహామూర్తి బుద్ధుడు

మల్లుడు : మీరు నడిచినడిచి అలసిపోయినట్టున్నారు. కాస్త విశ్రమిస్తారా?

నందుడు  నాయనా! స్వామిని చూచేదాకా నాకుగానీ ఆమెకుగానీ రెప్పవాలదు మూడేళ్ళైంది ఆయన్ను చూడక. దక్షిణం అంతా సంచారంచేసి ఆయన మహాబోధను జనానికి వినిపిస్తూ వస్తున్నాం. మాకు బుద్ధుడే నిద్ర బుద్ధుడే మేల్కొల్పు

కల్యాణి  (కొంచెం నిట్టూర్చుతూ) మాకు బుద్ధుడే బ్రతుకు, బుద్ధుడే మెతుకు, బుద్ధుడే ఆనందం, బుద్ధుడే అందం చందం

మల్లుడు, ఆహా! శారీరక తుచ్ఛవాంఛితాల్ని జయించి అచుంబితమైన సత్యాన్ని అన్వేషించే మీ బ్రతుకులు ఎంత పవిత్రమైనవి? మేము రేయింబగళ్ళూ పొట్టకూటికోసం నానా అగచాట్లూపడి, ఆ తరువాత కామ ఉల్బణంవలన సంసారం పెంచుకుని పట్టుపురుగులా మా చుట్టూ మేమే ఉచ్చులు అల్లుకుని చస్తున్నాం. మీరు ముక్తులు, మీరు పుణ్యులు.

కల్యాణి
నెత్తిపై భారమున్న వానికి విషాదము
అది తొలగిపోయినపుడు సౌఖ్యమ్ము కలుగు
ఒక్కపర్యాయ మా భార మూడ్చివేయ
మరల దానిని వహియింప మనసుపోదు

నందుడు
పైడిపై నాడుదానిపై మేడలపయి
పాడుకోరిక హెచ్చి సంబరము నచ్చి
తిరిగి జన్మించి తిరిగి మిత్తి చెయి చిక్కి
మానవుం డెంతగా వగపూనినాడు!

కల్యాణి
పశువులను పక్షులను పట్టివైచుకొఱకు
మానవుం డుచ్చు పన్నగా బూనెగాని
అతడెరుంగడు సంసారమనెడి యుచ్చు
పన్నుకొను తానె, అద్దాన పడును తానె.

మల్లుడు  ఈరోజు నా జన్మ ధన్యమైంది. మీరిరువురు బురదలో తామరవలె ఈ కలుషమైన ప్రపంచంలోను అకలుషంగా జీవిస్తున్నారు అట్టి మీరు ఈనాడు మాకు అతిథులు కావడం నాపుణ్యం కాదా!

నందుడు · మనమంతా బుద్ధమూర్తికి అతిథులం ఆయన ఏచోట నివసిస్తారో అక్కడ పులులు మేకలతో మైత్రిచేస్తాయి. పావురాళ్ళు డేగల చంకల్లో నిద్రిస్తాయి, పాములు నెమళ్ళతో ఆడుకుంటాయి. దేవతలు మనుష్యుల్తో వియ్యమందుకుంటారు, రాక్షసులు శాంతులై స్వామిని భజిస్తారు.

కల్యాణి · ఆయన దయామయుడు ఆయన ఎంతదూరం చూస్తే అంతదూరం అమృతం వర్షిస్తుంది ఆయన నవ్వితే నరనరాల్లో స్వర్గాలు మొలుస్తాయి. ఆయన మాట్లాడితే గుండెల్లో తేనెవానలు కురుస్తాయి.

మల్లుడు ఆయన్నుగూర్చివించే పాపాలు పలాయనం చేస్తాయి. ఆయన అనుచరులతో సంభాషిస్తే మనస్సులోని కొండలన్నీ కరిగిపోయి బ్రతుకు తేలిక అవుతుంది.

నందుడు నాయనా ! ఆయన బుద్ధుడు ఎవరూచూడని కాంతిని ఆయన బోధివృక్షం కింద చూచారు ఆయన్ను భజించుతాం నాయనా !

కల్యాణి భజరే బుద్ధం, భజరే బుద్ధం
భజరే బుద్ధం పావనశీ !
రుజతో జరతో పజపజలాడే
ప్రజపాలిటి కత దజరామరుడూ !
చీకటికోనల ఆకటి కిలల
చీకాకులపడు లోకము విడుమీ !
ఒకరిగొంతుకల నొక్కరు నొక్కి
వికవికనవ్వులు విడువం దోహో !
నీచ చింతనలు నీచవాంఛలూ
విడచిరండహో విజ్ఞానులుగా !

## (రెండవ రంగం)

బుద్ధుడు . ఆనందా !

ఆనందుడు స్వామీ !

బుద్ధుడు మనం ఇప్పుడు ఎక్కడున్నాం.

ఆనందుడు మనం వైశాలికి దగ్గరగా ఆమ్రవనంలో వున్నాం స్వామీ! ఈ వనం ఆమ్రపాలిది. నిన్న మనకు ఆతిథ్యం ఇచ్చింది ఆమే.

బుద్ధుడు నాయనా ! అపస్మారం కమ్ముకో వస్తున్నది. నాకు నిన్నటి మాటే జ్ఞాపకంలేదు. అవును ! అన్నట్టు ఆమ్రపాలి ఎంతమంచిది.

ఆనందుడు అవును స్వామీ ! నిప్పుల్లో వుండి శైతల్యం అనుభవించినట్టు భోగదేహంలో వున్న యోగిని ఆమె.

బుద్ధుడు ధమ్యరాలు ఆఁ. అన్నట్టు ఆనందా ! నన్ను ఇక్కడనుంచి హిరణ్యవతివైపు తీసుకోపొండి. ఆ నదీ తరంగాల చల్లదనం శరీరానికి కొంత శాంతినిస్తుందేమో చూతాం.

ఆనందుడు ! హిరణ్యవతి చాలా దూరం స్వామీ, ఇక్కడికి.

బుద్ధుడు . ఫరవాలేదు నాయనా ! పోదాంపద. అక్కడి సాలవనం, వాటి దట్టమైన నీడలు.

ఆనందుడు స్వామీ! కల్యాణి వచ్చేదాకా ఇక్కడే వుందామన్నారు మరో రోజు చూశాం.

బుద్ధుడు: ఔను. కల్యాణిని చూడాలి. వుండుపడిన మనసుమీద అమృతలేపనం వంటిది కల్యాణి. కల్యాణి నీకూ నాకేగాక ప్రపంచం అంతటికీ కల్యాణి. జరను జయించిన కొద్దిమందిలో కల్యాణి ఒకతి.

ఆనందుడు స్వామీ, మీరు కొద్దిగా విశ్రమించితే బావుండును. కొంత బడలిక తగ్గేది,

బుద్ధుడు ఇంకా బడలిక యేమిటి! మాట్లాడుతుంటేనే నాకు బడలిక తగ్గుతుంది. ఎనభై యేళ్ళ బరువు శరీరాన్ని కృంగదీసింది. కాని ధ్వనినాళం నంతతవ్యాయామంవల్ల ఇంకా బలంగానే వుంది. మాట్లాడనీ.

ఆమ్రపాలి స్వామీ!

బుద్ధుడు ఎవ్వరది!

ఆమ్రపాలి నేను ఆమ్రపాలిని ఒక్క గుటకెడు పాయసం పుచ్చుకొండి.

బుద్ధుడు వద్దు. జీర్ణకోశంలో పాయసాన్ని హరించుకొనే శక్తిలేదు ఏమైనా మాట్లాడు. నీ మాటల్ని తాగి బతుకుతాను

ఆమ్రపాలి స్వామీ, ఆహారం ఏమీ లేకుంటే శరీరం మరీ డస్సిపోతుంది

బుద్ధుడు మహాసర్పాలు గాలిని తిని బలంగా వుంటాయి చకోరాలు వెన్నెల తింటాయి. నేను శబ్దాలు తిని బతుకుతాను.

ఆమ్రపాలి. అయ్యో! మీ పెదవులు ఎండిపోతున్నాయి, కొంచెం వక్కరసంతో తడపనీండి స్వామీ!

బుద్ధుడు. మనస్సుకూ పెదవులున్నాయి. అవీ కదులుతాయి. అవీ ఎండిపోతాయి వాటికి పూలరసం కావాలి. నేను శరీరం వదిలేసే కాలం సమీపిస్తున్నది నాకు ఇంకాఆహారం పెట్టి జీవితం పొడుగు పెంచకండి.

ఆనందుడు అయ్యో! అదేమిటి స్వామీ! శత సహస్ర శరత్తులు ఇంకా జీవించి ఈ లోకంలో ఏ మూలనా చీకట్లు లేకుండా చేయవలసిన మీరు— మమ్మల్ని అప్పుడే వదిలేయాలనుకుంటే మేమంతా అనాథులమైపోతాం.

బుద్ధుడు నాకు ప్రతి దీపం ముట్టించడం ఇష్టంలేదు. నామంది ఒక జ్వాల తీసుకోండి కావాలంటే పది జ్వాలలిస్తాను. దీపాల తోరణాలు ముట్టించుకోండి, నేను ప్రతి మనిషిదాకా పోలేను.

ఆనందుడు· మేము అందరినీ అందుకునేదాకా ఇక్కడ కూర్చుని పర్యవేక్షించండి. మీరే అన్ని పనులూ చేయక్కరలేదు

బుద్ధుడు: మేఘం వర్షిస్తుంది. వర్షజలం సముద్రం చేరేదాకా కూచోదు. (పెద్దగా దగ్గు)

ఆనందుడు: స్వామీ. స్వామీ!

బుద్ధుడు: (మళ్ళీ దగ్గు) నాయనా! నన్ను ఉపావర్తనంలోని సాలనికుంజాలవైపు తీసుకోపో.

ఆనందుడు: అదిగో! కల్యాణి. కల్యాణి వచ్చింది.

కల్యాణి: స్వామీ! స్వామీ.

బుద్ధుడు : అమ్మా !

కల్యాణి : స్వామీ ! అగ్నిలాంటి మీ శరీరం తేజోహీనమైపోయింది.

బుద్ధుడు . విశ్రమించే గడియ దగ్గరగా వస్తున్నదమ్మా ! (దగ్గు) దప్పి, దప్పి.

కల్యాణి : స్వామీ ! ఇదిగో నారికేళ జలం.

బుద్ధుడు : వద్దు. నాకు నైరంజరా నది నీళ్లు కావాలి.

ఆనందుడు : అయితే ఇప్పుడే బయలుదేరదాం

కల్యాణి . అక్కరలేదు నైరంజరానది నీళ్లు నా వెంట నందుడివద్ద వున్నాయి.

బుద్ధుడు : కల్యాణీ ! నైరంజరానది వొడ్డు నలభై యేభై ఏళ్ల క్రింద న్యగ్రోధవృక్షం నీడలో మన్మథుడు నాతో భేటీ వచ్చాడు.

ఆనందుడు స్వామీ ! ఇదో నైరంజరా జలం, పుచ్చుకోండి.

బుద్ధుడు . ఒక్క గుటక, ఒకే ఒక్క గుటక అమ్మా ! కల్యాణీ, మన్మథుడు తన కూతుళ్లతో వచ్చి నన్ను కవ్వించడం (దగ్గు)

కల్యాణి : స్వామీ !

బుద్ధుడు · ఫరవాలేదు. నాకు ఇష్టం లేకుండా మృత్యువు నన్ను తీసుకోపోదు. నేను మరో నాల్గుపూటలు మీతో గడుపుతాను దుఃఖంలో మృత్యు వుంది దుఃఖాన్ని చంపినప్పుడు మృత్యువు మనమీద అధికారం కోల్పోతుంది ఇప్పుడు మృత్యువుమీదే మన అధికారం. నేను రమ్మంటే అది వస్తుంది.

కల్యాణి : మీరు దాన్ని రమ్మనవద్దు స్వామీ !

బుద్ధుడు . (నవ్వు) పిచ్చిదానా ! శూన్యంలో విశ్రాంతి వుంది మృత్యువు శూన్యానికి దారి.

కల్యాణి · లోకం దుఃఖంలోంచి విడిపోందే మీరు వెళ్లిపోతే మీరు పోగానే దుఃఖం మళ్లీ లోకంమీద విజృంభిస్తుంది

బుద్ధుడు · మీ వజ్రపథాలు ఎడురెత్తి నిలవండి. మీకు ఆశక్తి ఇచ్చాను. (ఉద్రేకంతో, బిగ్గరగా) దుఃఖాన్ని లోకంలోకి రానీకండి.

దుఃఖాల మేడలు కడుతో, నన్ను అనేక జన్మలెత్తిస్తో, నాకు కనపడకుండా ఒక దొంగ పొంచిపొంచి తిరిగేవాడు వాణ్ణి పట్టుకోడానికి శతసహస్ర జన్మలెత్తి వాణ్ణి అన్వేషించాను.

(మరీ ఉద్రేకంలో) వాడు దొరికాడు. వాడు కట్టిన ఉక్కుమేడల్ని దుఃఖపు నీలి మేడల్ని పగులగొట్టాను బయటికి వచ్చేశాను నేను విశాలమైన మైదానంలో వున్నాను. దీనికి తలుపులూ, ద్వారబంధాలు లేవు పై కప్పులూ, ప్రాకారాలు లేవు. ఇంకా నన్నెవరూ బంధించలేరు (దగ్గు)

కల్యాణి : స్వామీ ! విశ్రమించండి.

బుద్ధుడు : (కొంచెం తక్కువ ధ్వనిలో)

దుఃఖమునకు తృష్ణ
మంచివాడవగుము, మంచి గావింపుము (కొంచెం ఆగి) వీరంతా ఎవరు ?

ఆనందుడు . వీరంతా ఉపాసకులు ఇతడు ఉపాలి, ఇతడు అనురుద్ధుడు, ఈమె ఉత్తర, ఈమె క్షేమ, ఈమె ఉత్పలవర్ణ.

బుద్ధుడు . ఉత్పలవర్ణా !

ఉత్పల · స్వామీ !

బుద్ధుడు · ఎటునుంచి వస్తున్నారు, మీరంతా ?

ఉత్పలవర్ణ ప్రాక్ప్రపంచం అంతాతిరిగి మీ తేజఃకిరణాల్ని మానవకోటి మనస్సుల్లోకి చల్లి వస్తున్నాం. లోకం తేజోమయంగావుంది చీకటిపోయింది సత్యం అర్థమైంది

ఉపాలి . స్వామి ! నేను ఉపాలిని, ఉత్తర సముద్రందాకా వెళ్ళి తథాగతుని బుద్ధత్వాన్ని బోధించాను వేదనాతప్తమైన ప్రాణికోటికి వేదదీరినట్లయి శాంతి వెల్లివిరిసింది

బుద్ధుడు అయితే నన్నుపోనీండి. శరీరం నశించాలి, తప్పదు నశించంది సత్యం సత్యాన్ని దివిటీగా పుచ్చుకుని మనిషి హృదయకుహరాల్లోని చీకటిమీద దాడిచేశారు మీరు బాగుంది. మీరంతా సమర్థులైనారు. నాకృషి ఫలిస్తున్నది నాకు పసుపుపచ్చ గుడ్డలు కట్టండి. వాటిమీద బంగారు జలతారువేయండి నన్నుపోనీండి నన్నుపోనీండి

ఆనందుడు : స్వామీ ! (కొంచెం ఉద్వేగంతో) మీరు వెళ్ళిపోతే మాకు జ్ఞానోద్బోధం ఎవరు చేస్తారు. క్షణక్షణం మాకు క్రమమార్గం ఎవరుచూపుతారు అజ్ఞానపు చీకటి అమావాస్యలా ఆవరించిననాడు ఓ పెద్దదీపం చేత పుచ్చుకునివచ్చి మమ్మల్నందర్నీ లేపావు ఇప్పుడా దీపాన్ని మలుపుకుని వెళ్ళిపోతానంటే మేం భరించలేం (ఏడుస్తాడు)

బుద్ధుడు . ఆనందా ! దుఃఖించకు నేను పదేపదే చెప్పాను మనకు అత్యంతప్రియమైన వస్తువుల్నిసైతం విడిచేసి దూరంగా బ్రతకవలసివస్తుందని దూరంగావుండడం నేర్చుకోవాలి జ్ఞాని అయినవాడు దుఃఖమూలాన్ని ఏర్పడిన ఈ శరీరాన్ని శాశ్వతంగా ఉంచుకోవాలనుకోడు ఈ శరీరం దుఃఖాలకూడలి దీన్ని పరిభ్రష్టం చేయాలి ధర్మదేహం తేజోవంతంగా వెలుగుతుండగా మాంసలమైన దేహాన్ని నేనింకా ఎంతకాలం దాచి ఉంచుకోవాలి? నాకు విశ్రాంతి కావాలి నన్ను వెళ్ళిపోనీండి నేను వెళ్ళిపోవడానికి తుదినిర్ణయం చేసుకున్నాను.

కల్యాణి అయితే మాకుగతి యెవ్వరు?

బుద్ధుడు · పిచ్చిదానా ! నేను మొదటి బుద్ధుణ్ణికాను తుదివాణ్ణికాను నాకన్న తేజోమూర్తి అయిన మరోబుద్ధుడు సమయం వచ్చినప్పుడు అవతరిస్తాడు. అతడు మనుషులకు దేవతలకూ మహాధిపతిగావుంటాడు నేను చెప్పినసత్యాల్ని అతడు మళ్ళీ మీకు జ్ఞాపకం చేస్తాడు.

ఆనందుడు : అతన్ని మేం ఎలా గుర్తించగలం స్వామీ ?

బుద్ధుడు : అతని పేరు మైత్రేయబుద్ధుడు. అతడు దయారాశి (పెద్దగా దగ్గు).

కల్యాణి : స్వామీ ! స్వామీ ! (కలకలం దుఃఖం, రోదనం)

ఆనందుడు (గంభీరంగా) మిత్రులారా ! ధైర్యంగా దుఃఖాన్ని మ్రింగండి. బుద్ధుని పాదాలకు మ్రొక్కండి. ఆయన ఇంచుమించు తుదిసారిగా చెప్పినమాట మననం చేసుకోండి. "ప్రతి వస్తువూ నశిస్తుంది నశించనిది సత్యం ఒక్కటే."

కల్యాణి స్వామి ఎంతో తొందరగా మనని వదిలిపోయారు. ఆనందమయుడైన స్వామి బ్రతుకు చాలించారు. ప్రపంచ తేజస్సు చాలా త్వరగా చల్లారింది (రోదిస్తుంది).

నందుడు అబద్ధం. స్వామి తేజస్సు సంఘంలో పుంజీభవించింది ఇప్పుడు మనకు సంఘమే శరణం. సంఘం శరణం గచ్ఛామి.

ఆనందుడు మహాదుఃఖంలోనూ ఆనందంగా బతకాలి మనం. కన్నీళ్ళు మనస్సులో మాలిన్యాన్ని నింపుతాయి. కళ్ళు తుడుచుకోండి. దుఃఖాన్ని మ్రింగండి. పూలు, పూలమాలలు తెండి. వీణలూ వేణువులూ వాయించండి. స్వామి నిశ్శబ్దంగా శయనించిన సాలవనంవైపు రండి

కల్యాణి · అదిగో ! ఆకాశంనుంచి మందారపుష్పాలు కురుస్తున్నాయి.

ఆనందుడు వాయించండి వాద్యాలు. (మృదంగాలు, వేణు వీణాదులు మ్రోగిన చప్పుడు)

(పావు నిముషం)

కల్యాణి పాడండి, ఆనందంతో బుద్ధుణ్ని గూర్చి. 'భజరే బుద్ధం భజరే బుద్ధం' (సన్నగా దూరంనుంచి పావు నిమిషం వినిపిస్తుంది )

అంతా కలిసి బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

( సన్నాయిపాట పావు నిమిషం )

ఆనందుడు ఇది నిర్వాణపథమ్ము దీనిపయి మీ
రెవ్వారు కానిండు మీ
పదముల్ మోపుడు ; వర్ణ వర్గ కుల సంప
త్భేదియున్ దారి వ
ద్దదు , దుఃఖాస్పదమైన ఈ భవము భ్ర
ష్టం బౌటకున్ మున్నె అం
బుదమ ట్లార్తుల పేదదీర్చుడు రుజాభుగ్న ప్రపం
చంబునన్



# మృత్యునిరాసము

—శ్రీ సురయా

చిన్నవాడనై నే వికసింప నెదల
నిప్పుడే వాంఛ లొదవె నాకీ జగమ్ము
పై మమతగ్గలె బ్రతుకుపై భ్రాంతిపుట్టి
ఆగుమాగుమో మృత్యువా! ఆగుమమ్మ.

నిన్న మొన్నటి వఱకు నా చిన్నతనపు
కష్టజీవిత గాథలే కలచి వేయ
నెటులొగడచె గాలమ్ము నా కెఱుకలేక
ఎఱుగ దలచితి జగతి నే నింకనైన

ఎడద యానంద సౌందర్య మెఱుగలేదు
పీడకలవోలె బాధ వెంటాడె నన్ను
గాలి సోకిన భీరువు వోలె నేను
నిలచినాడ నిట గతమ్ము తలచుకొంచు

ఆరిపోయెను బాధా మహాగ్ని యిపుడు
ఆశయను జ్యోతి కిప్పుడే యందె వెలుగు
వెలుగునై యొక క్షణమేని మెలగనిమ్ము
నిలుము నిలుమోయి మృత్యువా! నిలువుమోయి,

కారుమేఘాల జీల్చుక కదలివచ్చి
వెలుఁది వెన్నెల వెదఁజల్లు చలువరేని
ఖాతి, బాధల వీడితి సాతిరేక
మొధవె, వాగు మృత్యువ! యాగుమోయి నీవు.

ఈ నవాయాత మధుమాస మీ ప్రఫుల్ల
యౌవనవనాంత మధుర విహారము - మన
సార, జవులూర చూడకే చనుట యెట్లొ
ఆగుమాగుమో ! మృత్యువా ! యాగుమోయి.

జీవితమ్ములో కమ్మని తావు లొసగు
తావులం జేర సౌఖ్య సంతానశాఖ
శాఖశాశీతలచ్ఛాయ శాంతి యొదవె
నిలుము ! నిలుమోయి మృత్యువా ! నిముసమేని

త్వరిత గతి నీకు వలదోయి , తాళుమోయి
జగతి నిప్పుడే వీడి నే చనగలేను
జగడమాడను నీతోడ జాలికలిగి
ఆగుమాగుమో మృత్యువా ఆగుమయ్య.

రెండు పదియేండ్లు మాత్రమే నిండె నాకు
తరళ జీవితమ్మున వసంతమ్ము వచ్చె
నేనె కోయిలనై యిట తేనెలొల్క
పరుల కింత యింపుగ నన్ను పాడనిమ్ము



వ్యాసము ·

# విదేశములలో భారతీయ బౌద్ధకళ

— శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

బౌద్ధమతము నానాదేశములలో కళాభ్యుదయమునకు దోహదమొనర్చెను. భారతదేశమునందు కళోపాసన పరమావధిగ పరిగణించిన శిల్పులు, చిత్రకారులు, స్థపతులు అతిలోక సౌందర్యమును సృష్టించి మార్గదర్శకులైరి. ఈ మాతృకలననుసరించి విదేశీయులు బౌద్ధమత సంబంధములైన శిల్పములను, చిత్రములను (ఆరంభమున కేవలం అనుకరణమే ప్రధానముగానెంచి తయారుచేసినను) క్రమముగ తమ విశిష్టశక్తిని పునరుజ్జీవింపజేసి భారతీయ ప్రభావమునకులోనైన దేశీయకళను ఆ యా దేశములందు ఉద్భవింపజేసిరి

చైనా, జపాన్, టిబెట్, బర్మా, థైలాండు, ఇండోచైనా, జావా, సిలోను, మధ్యఆసియా ఆఫ్ఘనిస్థానము, ఇరాన్ మొదలైన దేశములందు నేడు గాన్పించు బౌద్ధకళ పైవిధముగ భారతీయ ప్రభావమున వికసించిన దేశీయ కళయే అని నిస్సందేహముగా చెప్పవచ్చును చైనా, జపాను కళనుగూర్చి కొంతవరకు జనసామాన్యమునకు తెలిసియున్నను ఇతర దేశములందలి బౌద్ధకళనుగూర్చి చాలవరకు జనసామాన్యమునకు తెలియదు. కాబట్టి ఈ విషయమునుగూర్చి ఇచట కొద్దిగా ప్రస్తావన చేయబడును.

సిలోను అనబడు సింహళ ద్వీపమునందు భారతీయ కళాప్రభావము కొంత ఎక్కువగ గాన్పించుచున్నది. దీనికి కారణము మధ్య యుగమునందు సింహళ, దక్షిణ భారతములకు కలిగిన రాజకీయ, ఆర్థిక సంబంధ బాంధవ్యములు కాని క్రీ. పె. రెండుమూడు శతాబ్దములందే సింహళమునందు బౌద్ధమతమును, తదనుయాయిగ వచ్చిన బౌద్ధకళయు నెలకొనెను ఈ బౌద్ధకళ భారతదేశమునుండి వచ్చిన కళా సంప్రదాయమే మధ్యయుగము నాటి భారతీయ కళ క్రమముగ పరిణామము చెంది నేడు సింహళమునందు సామాన్య స్థితిలో గాన్పించుచున్నది కాని ప్రాచీనయుగమున సింహళమునకువచ్చిన బౌద్ధకళా సంప్రదాయము శ్రేష్ఠతరమైనది. ఈ సంప్రదాయమునకు చెందిన అవశేషములు స్వల్పముగానే గాన్పించుచున్నవి. కాని వీనిని బట్టి సింహళదేశమునందు కళాబీజములు నెలకొని దేశవిదేశసాంగత్యమున పూర్ణ వికాసమునొందుటకు తగినట్టి వాతావరణము నాడు ఉండెనని వాదించుటకు ఎంతయో ఆధారము గలదు ఒక్క సిగిరియ చిత్రముల ప్రస్తావన చేసిననే చాలును సింహళ చిత్రకళా నైపుణ్యము అజంతా వైఖరికి ఎంతమాత్రమును తీసిపోజాలదని ఘంటాపథముగ చెప్పవచ్చును.

జావాద్వీపము వైశాల్యమునందును, రాజకీయ ఘనతయందును ఏమంత గొప్పదికాక పోయినను బోరోబుదుర్ అను పట్టణమందు అనమాన శిల్పఖచిత వాస్తు విశేషమునకు నిలయమై లోకోత్తరఖ్యాతి గాంచినది భారతదేశమునుండివచ్చిన మతము, తత్త్వశాస్త్రము,



తుషితస్వర్గంలో బోధిసత్వుడు - నాగార్జునకొండ





కళాసంప్రదాయము దేశీయభావ సంప్రదాయములతో శృతి మేళవించి నూతన చైతన్యముతో విరాజిల్లినట్లు ఈ బోరోబుదూర్ స్తూపమును సూక్ష్మముగ పరిశీలించినయెడల బోధపడును. క్రీ. శ. 9 వ శతాబ్దమున నిర్మింపబడినను కాలవైపరీత్యమునకు లోనుగాక నేటికిని ఈ ఆశ్చర్యకరమైన సృష్టివైచిత్ర్యం శిథిలముగాలేదు. ఇందున్న రెండువేల శిల్ప ఖండములలో సుమారు 600 మాత్రమే నశించిపోగా మిగిలినవి కళాభిజ్ఞులకును కళోపాసకులకును మేలుబంతియై విరాజిల్లుచున్నవి

నేడు వీట్‌నామ్, వీట్‌మిన్హ్ అని ప్రసిద్ధి జెందిన ఇండోచైనాయందు గల వాస్తు, శిల్ప సంప్రదాయమునందు బౌద్ధమత ప్రభావమున కన్న హిందూమతప్రభావమే ఎక్కువగా గాన్పించుచున్నది అంగ్‌కోర్‌థామ్, అంగ్‌కోర్‌వాట్ నామస్మరణచేసిననే చాలును భారతీయ సంస్కృతి కళారూపమున విదేశములలో ఎట్టి ప్రకృష్టదశనొందెనో జ్ఞప్తికి వచ్చును హిందూమతమైనను, బౌద్ధమతమైనను ఏ మతమైననుసరే, భారతదేశమున కళా సంప్రదాయమునకు దోహదమొసంగి విదేశములయందు గూడ చాటి చెప్పగలిగిన ఈ ప్రభావం భారతీయ కళా సంప్రదాయమని ఒక్కమాటలో చెప్ప వచ్చును.

థైలాండు అనబడు సయాం, బర్మా దేశములందు భారతీయ సంప్రదాయము నెలకొని కాలక్రమమున జాతీయమైన కొన్ని విశిష్ట లక్షణములను సంపొందించెను ఈ దేశములందలి స్తూపములు ఘంటాకారమునుబొంది, వాని శిఖరములు, కూచిగ పొడవును సన్నదనమును కలిగియుండును. శిల్పచిత్ర కళా విన్యాసము నందును కూడ కొన్ని ముఖ్యమైన మార్పు లేర్పడినందున దేవతామూర్తులను యక్షాది మూర్తులను అధికతర ఉత్ప్రేక్షాతిశయోక్తులతోనై విచిత్రముగ గాన్పించును. కాని ఇవి యన్నియు భారతీయ కళా బీజములనుండి ఉత్పన్నమై వికసించినవే. పగాన్ అను పట్టణమునగల ఆనంద దేవాలయమునగల వర్ణ చిత్రములు అజంతా, బాగ్ సంప్రదాయముపై నాధారము జేసి రచించినవే యని పండితుల యభిప్రాయము

మధ్య ఆసియాయందు నానా ప్రాంతములందు బౌద్ధ సంబంధములైన వాస్తు, శిల్ప చిత్రకళా అవశేషములు ఎన్నియో నేటికిని గాన్పించుచున్నవి. పురాతత్త్వజ్ఞులు కొందరు వీనిని సేకరించి, ఢిల్లీయందును, లండను మొదలగు ప్రదేశములందును భద్రపరచి యున్నారు. టుర్‌ఫాన్ (Turfan) నియా (Niya) ప్రదేశములందు బౌద్ధ కట్టడముల నలంకరించిన కుడ్య చిత్రములను కడు జాగ్రత్తతో సేకరించి ఢిల్లీలో మధ్యఆసియా పురావస్తు ప్రదర్శనశాలయందు భద్రపరచిన వారిలో ఖ్యాతిగాంచిన సర్ ఆరెల్‌స్టయిను (Sir Aurel Stein) అను శాస్త్రజ్ఞుడు ఇంకను ఎన్నియో విశేషములను కనుగొని ఎన్నియో గ్రంథములను రచించి ప్రచురించియున్నాడు. నేడు మహమ్మదీయమతమే ఈ ప్రాంతములందు గాన్పించుచున్నను, ప్రాచీనకాలమునందు బౌద్ధమతము మాత్రమే ఇచ్చట వ్యాపించియుండెనని తెలియుచున్నది. తూర్పు తురుష్కస్థానమనియు, చైనాభారి తురుష్కస్థానమనియు నామధేయమున బరగు మధ్య ఆసియా ప్రాంతమునందును, ఇందునకు సమీపమునవేగల కాంను (Kan-su) అనబడు చైనాదేశ భాగమునందును బౌద్ధము

అఖండముగా వ్యాపించియుండెనని ఖనన పరిశోధనవలన తెలియవచ్చినది. ఈ ప్రాంతమునకు దక్షిణమున గల ఖోటాన్(Khotan) బౌద్ధమునకు పూర్వమున ఒక ప్రధాన కేంద్రముగ నుండెను. గాంధార శిల్పమని ప్రఖ్యాతిగాంచిన భారతీయ కళారీతి ఇచట అనల్పముగ విలసిల్లెనని ఇచట దొరికిన శిల్పావశేషములనుబట్టి తెలియుచున్నది ఈ ప్రాంతమున దొరికిన సుందరమూర్తులలో దారుమయ (Wooden) బౌద్ధమూర్తులుకొన్ని ముద్దులొలుకుచున్నవి దారుమయ వస్తువులు సాధారణముగా ఎక్కువకాలము సుస్థిరముగ నుండజాలవు ఈప్రాంతమునందు గాలిలో ఏ మాత్రమును తడిలేనందున దారుమయ వస్తువులు శిథిలము చెందక, వానిపైన లేపనము జేసిన సువర్ణచ్ఛాయశోభతో ఇప్పటికిని క్రొత్త వస్తువులవలె గాన్పించుచున్నవి. ఈ కళారీతియందు కొద్దిగ ఇరాన్, చైనా సంప్రదాయముల ప్రభావము గాన్పించుచున్నను ఇది ఒక స్వతంత్ర సంప్రదాయమని చెప్పక తప్పదు

ఖోటాన్‌కన్న ఇంకను భారతదేశమునకు దూరముననున్న కాష్గర్(Keshgar) టామ్‌చుక్ (Tamchuk) ప్రదేశములందు దొరికిన బౌద్ధశిల్పము, కేవలము భారతీయ శిల్పము వలెనేగాన్పించుచున్నది టామ్‌చుక్ వాయవ్య దిశయందు కాష్గర్‌కన్న దూరముగ మరల్‌బాషి (Maralbashi) ప్రాంతమునకు ఈశాన్య దిగ్భాగమునందు గలదు. ఇంత దూరమున దక్కని భారతీయశిల్పము దొరకుట ఆశ్చర్యకరమైన అంశమే. ఇంకను దూరమున ఈ ప్రాంతమునకు ఉత్తరమున గల కుచ (Kucha) పట్టణమున కుడ్య చిత్రములు గలవు. అచ్చటచ్చట కొద్దిగ ఇరాన్, చైనా ప్రభావము గాన్పించుచున్నను ఈ వర్ణచిత్రములు దక్కని భారతీయ వర్ణచిత్రములని తోచుచున్నవి కుచ పట్టణమునకు తూర్పున లోబ్‌నోర్ (Lob-Nor) అను ఒక పెద్ద తటాకమును నీటిముంపు ప్రదేశమును గలవు. ఇచట గూడ కొన్ని కుడ్యచిత్రములు కనుగొనబడినవి.

చైనావారి తురుష్క స్థానమునకు ఉత్తరమున గల కరషర్ (Karashar) వద్ద గాన్పించిన బౌద్ధ వస్తు విశేషములలో నానా సంప్రదాయ సమ్మిశ్రితమైన సంకరరీతి గాన్పించుచున్నను ఇందునుగూడ ప్రధాన భూమిక భారతీయతనే చాటి చెప్పుచున్నది.

పైన పేర్కొనబడిన టుర్‌ఫాన్ (Turfan) వద్దనుండి సేకరించి ఢిల్లీ మొదలైన చోట్ల భద్రపరుపబడిన కుడ్యచిత్రములు ఉయిగరులు (Uigurs) అను తురుష్కజాతికి చెందిన ఒక తెగవారి చిత్రకళకుచెందినవి. ఈ కళాసంప్రదాయమున ప్రాతిపదికగ భారతీయ కళా సంప్రదాయముగలదు కాని దీనిపైన స్థానిక సంప్రదాయమును, టిబెట్ కళాసంప్రదాయము తన ప్రభావమును జూపించినందున ఎంతయో భేదము గాన్పించుచున్నది. ఇరాన్ సంప్రదాయముకూడా కొంత ఇందు గలదు. ఉయిగర్ (Uigurs) లలో చాలమంది మానికియన్ సన్యాసబృందము (Manichean monks) నకు చేరినవారు కలరు, గాన వారి ద్వారా ఇరాన్ సంప్రదాయము కొంతవరకు ఈ కళా రీతియందు తన ప్రభావమును నెలకొల్పెను

తురుష్క స్థానమును దాటిపోగా సరిహద్దులయందు చైనాదేశమునందలి కాన్-సు (Kan-Su) రాష్ట్రమునందు టున్ హా అంగ్ (Tun-huang) అను ప్రదేశమున సహస్ర

బుద్ధగుహా అను ఒక సుప్రసిద్ధ నిర్మాణము గలదు. ఈ గుహను సర్ ఆరెల్ స్టైన్ (Sir Aurel Stein), పెల్లియో (Palliot) అను పురాతత్త్వజ్ఞులు దర్శించి ఇందున్న కుడ్య చిత్రములను బయటకు దీసి చాలవరకు యూరపు, అమెరికాలకు చేర్చిరి. బహు కొద్దిగ ఢిల్లీకి గూడా ఈ వర్ణచిత్రములు చేరెను ఈ కళారీతి యందును గూడా టిబెటన్, చైనా, పర్షియన్ రీతుల ప్రభావము గానిపించుచున్నను ప్రధానముగ భారతీయ సంప్రదాయమే గానిపించుచున్నది.

టిబెట్ (Tibet) దేశమునగల బౌద్ధ కళా సంప్రదాయమును గూర్చి సూక్ష్మముగనైన వర్ణించుటకు ఇచట సాధ్యముగాదు టిబెటన్ సంస్కృతియందు భారతీయ సంస్కృతి ప్రధానభూతమైనను కొన్ని కొన్ని ఇతర దేశముల సంస్కృతి ప్రభావమునకు లోనైన టిబెటన్ సంస్కృతి స్వతంత్రముగ వికసించి క్రమపరిణామ వికాసమునకు లోనై ఒక ప్రత్యేక సంప్రదాయముగ మారిపోయినది. ఉదాహరణముగ టిబెటన్ వాస్తు సంప్రదాయమును గైకొందము. ఈ సంప్రదాయమును సూక్ష్మముగ పరిశీలించినయెడల ఇందు ఈజిప్టు (Egypt) వాస్తు ప్రభావమేమైన గలదా యని అనుమానము జనించకమానదు. చక్కని సరళరేఖలు, జ్యామితిశాస్త్ర సంబంధములగు రూపములు, ఆకారములు, ప్రధానముగ గల టిబెటన్ కట్టడములలో వర్ణవిన్యాసము గూడ ఒక ప్రత్యేక సంప్రదాయము ననుసరించి విశాలభాగములకు సాధారణముగ ఒకటే వర్ణము ఉండునట్లు ఏర్పాటు చేయబడి యున్నది. అందువలన నేటి టిబెటన్ భవనములు చిన్నవి, పెద్దవికూడ సుస్థిరములైన కోటలవలె గానిపించును. గ్యాన్ట్సె (Gyantse) వద్దగల బంగారు పైకప్పుచే అలంకరించిన దేవాలయమును గాని లాసా (Lhassa) పట్టణమున మార్బో-రి (Marbo-ri) దేవాలయమున మీపమునగల ద్వారమును గాని చూచినయెడల ఈ వాస్తు సంప్రదాయమున గల 'జ్యామితి' రూప ప్రాధాన్యత స్పష్టము కాగలదు. ఇక పోతల (Po-ta-la) అను దలై-లామా (Dalai - Lama) ప్రభువు యొక్క రాజప్రాసాదమును జూచినయెడల వర్ణవిన్యాసమున వీరికిగల ఏకవర్ణప్రీతిని గూర్చి విశదము కాలదు.

మూర్తిశిల్పమునందు టిబెట్‌వారు ప్రారంభమున (అనగా క్రీ॥ శ॥ 12 నుండి 14 వ శతాబ్దముల వరకు) నేపాలు దేశమునందలి సంప్రదాయమును తెచ్చిపెట్టుకొనినను స్వల్పకాలములోనే తమ వ్యక్తిత్వము స్థిరపడి క్రమముగ నేపాలు దేశముపైననే తమ ప్రభావము అధికమైనందున నేడు చాలవరకు నేపాలు దేశస్థపతులకును, శిల్పులకును టిబెట్ దేశము మార్గదర్శియై యున్నది.

ఇట్టి అనల్ప కళా సంపదకు నిలయమైనను టిబెట్ దేశమునందు అర్ధశిల్పము (Vas-relief seulpture) మాత్రము గానరాదు. అర్ధశిల్పము భారతదేశమునందేగాక ఆసియాయందు బౌద్ధము వ్యాపించిన చాలదేశములలో అధిక ప్రాధాన్యత వహించియుండగా ఒక్క టిబెట్‌నందు మాత్రం కానరాకుండుట ఒక విచిత్రసంఘటనమే. ప్రాచీనతమ బౌద్ధ నిర్మాణములందు మాత్రమే టిబెట్ దేశమున బహుస్వల్పముగ అర్ధశిల్పము గానిపించుచున్నందున ఓల్డెన్‌బర్గ్ (Oldenburg) పండితుడు చెప్పినట్లుగ బహుశః భారతీయ శిల్పులే టిబెట్ దేశమునకు వెళ్ళి ఈ శిల్ప రచన గావించిరేమో!

టిబెట్ దేశీయులు శిల్పరీతిని ఎంతమాత్రము సాధించలేక పోయిరేమో అని తలచుటకు వీలు కలదు

చిత్రకళయందు టిబెట్‌వారి ప్రావీణ్యము ఎట్టివారికిని ఆశ్చర్యము గొల్పకమానదు ప్రారంభమున చిత్రకళయు గూడ నేపాల్ మొదలగు భారతదేశ ప్రాంతములనుండియే టిబెట్ దేశమునకు వ్యాపించుచుండెను. కాని వీనిని అనుకరించుచు మాత్రమే కాలముగడపక టిబెటన్ చిత్రకారులు వీటిపైన టంగుట్ (Tangut) కళా సంప్రదాయమును ప్రభవింప జేసిరి ఈ టంగుట్ సంప్రదాయమున ఉయిగర్ (Uigur). చైనా (Chinese) ఇరాన్ (Iran) సంప్రదాయముల ప్రభావము గలదు కాలక్రమమున భారతీయ మాతృకలను పరివర్తనము నొందింపజేసి, మత దృష్ట్యా నిర్ణీతముజేసిన నియమ నిబంధనల సంకెళ్లకులోనై గూడ టిబెటన్ చిత్రకారులు తమ అనూన ప్రతిభ వలన మనోహర చిత్రసృష్టిని చేయగల్గిరి చిత్రములందుగాన్పించు ప్రకృతి భూమికయు, ఉజ్జ్వల వర్ణ విలేపనమును, టిబెట్ చిత్ర సంప్రదాయమునకు ఒక ప్రత్యేక విశిష్టత నాపాదించియున్నవి.

సూక్ష్మ చిత్రరచనయందు టిబెటన్ కళోపాసకులు సాటిలేనివారని చెప్పవచ్చును. కొన్నికొన్ని చోట్ల సుమారు 10 అంగుళముల ఎత్తు, 8 అంగుళముల వెడల్పుగల చిత్రపటమునందు మూటికి పైగా మానవాకారములను చిత్రించియున్నను ఏ ఒక్కటినిదీని భూతద్దముతో పరిశీలించినను గూడ రూపురేఖా విలాసములందు గాని, అంగాంగ రచనయందు గాని, ఆహార్యమునందు గాని ఏ ఒక్క అప్రధానాంశమునందునైనను చిత్ర రచయిత సమగ్ర సౌష్ఠవమును జూపలేదని చెప్ప వీలులేదు ఒక్కొక్క మూర్తికిని ఒక అంగుళ మాత్ర ప్రమాణమే ఉన్నను చిత్రకారుడు ముద్దులొల్కునట్లు తీర్చి దిద్దియున్నాడు ఒక్కొక్కమారు ఒకటిరెండు గీతలను వేసియే సర్వాంగ సౌష్ఠవముగ చిత్రమును రచించియున్నాడు ఇట్టి మనుష్యాతీత ప్రతిభ ఎట్టివారికిని ఆశ్చర్యము గొల్పకమానదు దీనికింతటికిని కారణము బౌద్ధమతమే, భారతీయ సంస్కృతి యొక్క నిర్మాణాత్మక ప్రభావమే.

సుమారు వెయ్యి సంవత్సరములుగ బానిసతనమున మునిగి నిర్వీర్యమై, అనుకరణమే పరమావధిక పరిగణించి పాశ్చాత్య వ్యామోహమునబడి ఇప్పుడిప్పుడే నిద్రమేల్కొని భావ దాస్య విమోచనమునకు గడంగిన భారతజాతి ఒక్కమారు ప్రాచీన ఆసియా చరిత్రమును, కళనూ, సంస్కృతిని పరిశీలించినచో ఈ భారతజాతియొక్క ఔన్నత్యమును, భారతీయ సంస్కృతియొక్క ఔత్కృష్ట్యతను గుర్తించగలదు కళా ప్రపంచమున భారతీయులకుగల ప్రాచీన ఘనతను విస్మరించి భారతీయులును, ఆసియా వాసులును స్వతంత్ర పథకమును ద్రొక్కి కళా సృష్టికి పూనుకొనినగాని కళాభ్యుదయము కొరకై తగినంత కృషి జరుగలేదనియే చెప్పవచ్చును.



# తులసి భాష

— శ్రీ నండూరి వేంకటసుబ్బారావు

తులసియే నాయెంకి యిలువేలుపు యెంకి
తులసి బాసనె తెలుపు నాపైని వలపు

"తులసిబా తులసి వా
పలకవా" యను నెంకి
తెలియనట్లు నేనుండ
అలిగి యవతల పండు

తులసియే ........

ఉలికి నేనట వ్రాలి
పిలుతు వెవరినె యనగ
తలనూపి ఉస్సురని
"తులసిని తులసినె" యను

తులసియే.........

వెలుగు తెన్నులె కనక
తెలవోవు నను జూచి
చిలిపిగ వదరు ఎంకి
తులసి పో తులసి రా

తులసియే. .......

ఎంకి అలకలు సదిరి
ఏమివలయునె యందు
కిలకిలా నగు ఎంకి
"తులసి రా తులసి రా"

**తులసియే నాకాయె తొలివేలుపు ఎంకి**
**తులసి బాసయె చూపు తెలుగు గల సొంపు.**

★

కథానిక .

# అంతిమ లేఖ

— శ్రీ వల్లపురెడ్డి

ఉదయం పదకొండు గంటలప్పుడు పోస్టు జవాను ఇచ్చివెళ్ళిన ఉత్తరాలను వెంటనే. ఆతృతతో చూడసాగాడు రవిభూషణ్ మొట్ట మొదటే ఉత్తరాలన్నిటిలోనూ పరిమాణంలో పెద్దగా ఉన్న ఒక కవరుమీద పడిం దాతని దృష్టి అన్నిటికంటే ముందుగా దాన్నే చేతిలోకి తీసుకున్నాడు. పరిమాణానికి తగిన బరువు కూడా ఉంది. దాన్లో ఏముందో విప్పి చూడకుండానే ఆలోచనలో పడ్డాడు.

ఒకసారి సుప్రసిద్ధ ఆంగ్ల వ్యాసకర్త అయిన ఆల్‌ఫ్రెడ్ జార్జి గార్డినర్ (Alfred George Gardiner) తనకు వచ్చిన ఉత్తరాల్లోకల్లా లావుగా ఉన్నదాన్ని మిత్రబృందం సమక్షంలో విప్పగా దానిలో ఒక నాచుమొక్క కనపడిందట. అది సముద్రపు నాచుమొక్క (Sea-weed) కావటం మూలాన అతణ్ణీ, అతని చుట్టూరా ఉన్న మిత్రుల్నీ సముద్రయానంలో పలుఘట్టాల్ని స్ఫురణకు తెచ్చుకునేట్టు చేసిందట కాని రవిభూషణ్ మాత్రం కవరును విప్పిచూడకుండానే ఆలోచనల్లో పడిపోయాడంటే, కారణం సామాన్యులకు దురూహ్యమే

రవిభూషణ్ ఒక సుప్రసిద్ధ అభ్యుదయ కథారచయితగా పేరొందినవాడు తను కథాలను పత్రికాముఖంగా జగత్తుకు వెల్లడించటంలో ఈనాడు సామాన్య ప్రాథమిక రచయితలకు ఎదురయ్యే అడ్డంకులే - ఏ పత్రికల వాళ్ళూ స్వీకరించి ప్రచురించకపోవటం— అతనికీ ఎదురయ్యాయి ప్రప్రథమంలో. కాని క్రమంగా వాటిని కొందరు అనుయాయులవల్ల దాటి, కొన్నాళ్ళనుండి నిర్విఘాటంగా తన ఆశయాలను, కల్పనలను సాహితీలోకంలోకి విసురుతున్నాడు రచనా విధానంలో తనకు తాను ఒక క్రొత్త పోకడ పోతున్నాడు ఈనాడెవరూ అతని రచనలు త్రిప్పిపంపటం లేదు సరికదా, కావాలని అర్జులు వ్రాస్తున్నారు ఈవిధంగా అతడికి రచయితల లోకంలో చెప్పుకోదగ్గ ప్రతిపత్తే వచ్చింది.

ఆ లావుపాటి కవరుమీద దృష్టి పడటంతోనే అది ఉత్తరం మాత్రం అయిఉండదని తీర్మానించుకున్నాడు తనకంత పెద్ద ఉత్తరాన్నెవరు రాస్తారు? తనకు ఉన్న మిత్రబృందంలో అంత ఉత్తరాన్ని వ్రాసే సమర్థుడెవరూలేరు, అథవా ఉన్నా రాయాల్సిన అవసరం పడదు పోగా, అది ఏ పత్రికనుంచైనా తిరిగివచ్చిన తన రచన అయిఉండాలి. కాని తనరచనను త్రిప్పి పంపేంత గుండె లెవరికున్నాయి యీనాడు? ఎంత దూరం మేధస్సును పరువెత్తించినా సరయిన కారణం దొరకలేదు. అది నిజంగా తిరిగి వచ్చిన రచనే అయిఉంటే తారాపథాన్నందుకుంటూన్న తనకు ఇది వజ్రపాతం కవరుమీది ముద్రలను పరిశీలించాడు. లాభంలేకపోయింది. అన్నీ ఒకదానిమీద ఒకటి పడివుండటం మూలాన అదెక్కడినుండి తన ప్రయాణాన్ని సాగించిందో తెలిసికోలేకపోయాడు. ఇక చూడటం మినహా కర్తవ్యం లేదనుకున్నాడు.

తీరా విప్పి చూచేసరికి అది ఉత్తరమే. రవిభూషణ్ ఆశ్చర్యానికి హద్దులేకపోయింది. ఉత్తరం 'నాయనా, రవీ!' అని ప్రారంభమై ఉంది. పేజీలు త్రిప్పి ముగింపు చూశాడు ఆతృతను కళ్ళెం బిగించలేక 'నీకు సైత వోజ్జ్వలమైన భవిష్యత్తును ఆకాంక్షిస్తూన్న, కిష్టమ్మ' అని అంతమైంది. ఆద్యంతాలను అవలోకించినంతమాత్రాన లేఖాంతర్గత విషయాలు అర్థం కాలేదు చదవడం వినా కర్తవ్యం శూన్యమైంది.

"ఈరోజు నాజీవితానికి ఆఖరు కావచ్చు మరణశయ్య మీదినుంచి ఈ జాబు వ్రాయిస్తున్నాను నువ్వో పెద్ద రచయితవి నువ్వు నోరెత్తితే సరి మాటలు ధారాపాతంగా, అనర్గళంగా ప్రవహిస్తాయి నీవు కలం పట్టుకుంటే సరి శబ్దాలు నేను నేనంటూ, ఒకదాని కంటే ఒకటి ముందుగా— పందాలు వేసుకుని పరువెత్తి వస్తాయి నాకు తెలిసిన మిడిమిడి చదువు నీలాంటి వాడికి ఉత్తరం వ్రాయడానికి సరిపోదు అంచేత ఈ ఉత్తరాన్ని నీ రచనల్ని, విన్నూ అర్థం చేసుకున్న ఒక సాహితీవేత్తతో వ్రాయిస్తున్నా."

"నే నివాళ సంతృప్తితో చనిపోతున్నాను కొన్నాళ్ళక్రితం నువ్వు మాయింటికి వచ్చిన సమయంలో నా జీవితం శారీరకంగానూ, మానసికంగానూ దుఃఖ భాజనమై ఉంది. ఆనాడు మా ఇల్లరికపు టల్లుడు సాయినాథ్ నీతో పేచీ పడ్డాడు. నువ్వు 'అంగారకుడు' అనే మారుపేరున ఏదో పత్రికలో ఒక కథ వ్రాశావట దానిలోని పాత్రల పేర్లూ, వస్తువూ చాలామట్టుకు మా యింటిదేనని తెలిసింది. సాయినాథ్ బస్తీకి వెడితే కొందరు మిత్రులు ఆయనకా కథను చూపించి 'ఇది నీ కథేనోయ్, అంటూ అపహాస్యం చేశారట. వాళ్ళద్వారానే 'అంగారకుడు' అనేది నీమారు పేరని తెలుసుకున్నాడు ఆనాడు అతను చిందులు త్రొక్కుతూ ఇంటికొచ్చాడు. "ఆ ముండాకొడుక్కి ఇంకే కథా దొరకలేదూ! నాకథే పట్టుకోకపోతే!— వాడి కథ దొరికే దుంది కదా. వ్రాసుకోగూడదూ? ఈసారి ఇంటికిరానీ, వాడి పని చెబుతా జన్మలో మరచి పోగూడదు మరి" అంటూ, ఇష్ట మొచ్చినట్లల్లా క్రోధావేశంతో మాట్లాడుతూ, కాలు కాలిన పిల్లిలా అటూఇటూ తిరిగాడు మొదట్లో ఆవిషయం ఇంటివాళ్ళమైన మా కేమీ తెలియలేదు. కాని భార్య—నాపెద్ద కూతురు భారతి—అనునయించడంతోనే అంతా సవిస్తరంగా చెప్పాడు. ఆర్థికంగా ఏకూతురు సంసారం పతన దశకు వస్తుందో, ఆ కూతురుకి ఇవ్వమని భర్త చనిపోతూ నాకిచ్చిన ధనాన్ని ముందు యోచనలేకుండా అల్లుడైన సాయినాథ్‌కు వ్యాపార నిమిత్తం ఇవ్వడమూ, ఆ మరు సంవత్సరమే రెండో కూతురు విధవై వచ్చి ఇంట్లో కూచోవడం భాంతికీ, దానికీ పొసగక పోవడం మూలానా ఇరువురి కలహాలూ చూసి నేను బాధపడటమూ—ఇవన్నీ నీవు వ్రాసిన కథలోని అంశాలట అన్నీ చాలా మట్టుకు యదార్థ విషయాలే"

"చేతిలో ఉన్న అర్థం కాస్తా ఊడగుంజు కున్న తరువాత అల్లుడూ, కూతురూ నన్ను ఖాతరు చెయ్యకపోవడమటుంచి, తల పెద్దది కదాఅని మతికైనా కొంచం సుఖంగా ఇంట్లో ఉండనివ్వకపోవడంవల్ల నా హృదయం కోత పడిన సంగతి కూడా నిజమే ఈ విషయాలన్నీ మా సాయినాథ్ సహచరుడవై మా ఇంటికి తరుచుగా రాకపోకలు సాగించే నీలాంటివాడికి తెలియకుండా ఉంటాయనటా

నికి వీల్లేదు. కూతుళ్ళ భవిష్యద్గతి ఎలా ఉంటుందోననే దూరదృష్టిలేకుండా చేతిలోంచి జారవిడుచుకున్న భర్తగా రిచ్చిపోయిన భాగుస్తవిశేషంగురించి జీవితాంతమూ ఆవేదన పడ్డాను. ఒక కూతురు స్వార్థపరత్వానికి మరో కూతురు బలి అవుతుంటే నేను సవతి తల్లినైనా అయివుంటే బావుండుననిపించింది నాకు."

"కథ విషయమై సాయీనాథ్ నీతో తగాదా పడ్డనాటి నీమూర్తి ఈ కుదిపుడియల్లో నా కళ్ళలో కదలాడుతూవుంది. నీవు దేవతా మూర్తివి. సాక్షాత్ అంగారకుడివి భవద్విరచిత కథా వినిర్గత హేతిజ్వాలలు అస్మత్ జీవిత ప్రాంగణంలో పెరిగిపోయిన దుర్దాంతమైన కష్టాలు విని భస్మీకృత మొనర్చినందుకు ఆనాటినించీ నేను కొంచం శాంతిగా బ్రతగ్గలిగాను. ఆనాడు సాయీనాథ్ విన్ను అనరాని మాటలన్నీ అన్నాడు. ఐనా నువ్వు సాగర గాంభీర్యాన్ని వహించావు ఆయన నీ మీద చేయి చేసుకునే వాడే. కాని నీవు నిశ్చలంగా కూర్చుని ప్రసరింపచేసిన చూపుల్లోని సునిశిత గంభీరభావము అతణ్ణి తన నిశ్చయంనుండి మరల్చివేసింది."

"ఆనాటినుంచీ నీవు కథ వ్రాయడం మూలాన్ని తన ప్రవర్తన నడుగుర్లోకి ప్రాకిపోయిందనే భయంచేతనో, లేక ముమ్ముందింకా ఏమేనా వ్రాస్తాదేమోననే బెంగవల్లనో కాని నాకూ, నా మాటకూ క్రమంగా గౌరవం ఇచ్చాడు. భారతికూడా మణిమీద వాత్సల్యం ప్రకటించడం ప్రారంభించింది.

"అల్లుడూ కూతురూ, నన్నూ మణినీ గౌరవ దృష్టితో విలోకించడం బాహ్యంగానో, అంతర్గతంగానో చెప్పలేను. ఐనా మాకు బ్రతుకులో శారీరక సౌఖ్యమూ, క్రమశః మానసిక శాంతీ లభించినయి శారీరక సౌఖ్యమే మానసిక సౌఖ్యానికి మూలమనీ, మానసిక సౌఖ్యం కోసం శరీరాన్ని కష్టపెట్టడం ఫలప్రదమైన కార్యం కాదనీ నాకు అనుభవపూర్వకంగా తెలిసిననే కాని నీలా నాకు తర్కించి ఒప్పించే శక్తిలేదు."

"నీవు కథలో వ్రాసినట్టు భారతికి క్షయ వ్యాధి రాలేదు క్షయకంటే బలవత్తరమైన అంటువ్యాధి మమకారం అనే సూత్రంవల్లించినే వెళ్ళి ఆమెకు అహోరాత్రాలూ సేవ చెయ్యలేదు తన్మూలంగా క్షయవ్యాధీ తెచ్చుకోలేదు. మానవులందరినీ ఆవేశించే వృద్ధాప్యములోని అశక్తతవల్లనే ఈనాడు చనిపోతున్నాను. ఈనాటికీ భారతి నన్ను ద్వేషించడంలేదు మిగతా ఐదుగురు కూతుళ్ళతో బాటు నా సరసనే కూర్చుని కన్నీరు కార్చుతూ వుంది. అందరినీ నేను సమానమైన, కిల్బిష రహితమైనవాత్సల్యంతో ఆశీర్వదిస్తున్నాను."

"కథను కథాదృష్టితోనే చూడాలి గాని, తమనుగురించి వ్రాసినదేనని భుజాలు తడుముకోవడం బుద్ధిమంతుల లక్షణంకాదు, అని ఆనాడు సాయీనాథ్‌తో వాదనకు దిగిన సందర్భంలో అన్నావు. నీ నిర్వచనం వన్నె పోసిన సత్యమే ఐనా ఆయన నీమాటని అర్థంచేసికోకండా ధుమధుమలాడాడు. అసమయానికి నీ వలా వ్రాయడం నాకూ్కడా అసమంజసంగా తోచించి నీకు జ్ఞాపకముందో లేదో కాని తరువాత విన్ను ఆ విషయమై మందలించాను కూడా కాని ఈనాడు నేనింత సంతృప్తిగాకళ్ళు మూస్తున్నానంటేనీవు వ్రాసిన కథే అందుకు కారణం ఆ కథలోని విపరీతమైన విలువనీ, ప్రయోజనాన్నీ ఇప్పుడు గాని గ్రహించలేకపోతున్నాను. నీవు ఆ కథని సాయీనాథ్‌ని కించపరచాలనే ఉద్దేశంతో

వ్రాయలేదని అనాడే నాతో త్రికరణశుద్ధిగా చెప్పావు. అదను నిజమే. నీకు కథావస్తువు దొరకడమే ప్రధానలక్ష్యం. అది మిత్రుల్ని గురించో, శత్రువుల్ని గురించో అనే సంగతి నీ కనవసరం. దానివల్ల ఎవరు బాధపడతారో, ఎవరు ఆనందిస్తారో అని ఆలోచించడం నీకు కాలయాపన. ఏది ఎట్లున్నా నీకథమాత్రం నా హద్దువరకు ఒక అమూల్యమైన ప్రయోజనాన్ని సాధించింది"

"నీవు ఏ ప్రయోజనం కొరకు రచనల్ని కావిస్తున్నావో నాకు తెలీదు. విశ్వమానవ కళ్యాణ కాంక్షకంటే ఉత్తమమైన ఆశయం మరొకటికాదు అదే నీలక్ష్యం ఐ ఉంటుందని భావిస్తాను. అయితే నీవు అపేక్షించిన లక్ష్యాన్ని నీ కథలు చేరుకుంటున్నాయో లేదో కాని నాకుమాత్రం కళ్యాణం కూర్చింది. అందుకు నేను నిన్ను అభినందించాల్సివుంది. ఐతే ప్రతికథా ఏదో ఒకకుటుంబంలోని వ్యక్తుల పేర్లతో వ్రాయమనీ, ఆకుటుంబంలోనిలోపాల్ని వివరించమనీ పురమాయించడం లేదు"

"సాయినాథ్ కూ, నీకూ మధ్యవున్న మైత్రిలో రభాసాసకలిగి సప్పటినుంచీ నీవు మా ఇంటికి రావటం మానివేశావు. ఆయన నీగురించి ఎన్నడూ ప్రస్తావించలేదు. పిల్లలు ఎప్పుడేనా నీ పేరు ఉచ్చరిస్తేమాత్రం కసరుకుంటూ ఉంటారు. దీన్నిబట్టిచూస్తే ఆయనకు నీవంటే ఇంకా మెరమెర లాడుతూనే ఉందని తలుస్తాను. నా అనంతరం మణిని ఏం చేస్తారో దిగులుగాఉంది. ఐనా ఒక విధమైన తృప్తిఉంది. మొన్న మొన్ననే నా కడసారి కోరికగా కొంత స్థిరాస్తిని మణిపేర కేటాయించి దస్తావేజులుకూడా జరిపించాను."

"నీ కథలోని అంతిమ ఘట్టంకూడా మా కుటుంబానికి సరిపోలేదు. నా చేతులకి ఉన్న బంగరు మురుగులు నైతికంగా పతనమైన నన్నూ,మణినీ అవజ్ఞాన్విత దృష్టితో చూసిన భారతిపేర వీలునామా వ్రాయించి విచిత్రమైన మాతృవాత్సల్యాన్ని ప్రదర్శించడం లేదు. శ్రమ తీసుకొని, పిలవటంతోనే ఇందాకా వచ్చి నీకు నా తరఫున ఉత్తరం వ్రాసిన ఈ సాహిత్యకునికి పారితోషికంగా సమర్పించుకుంటున్నాను. కాని కాలాన్ని బట్టి మారిన మనుష్యుల మూర్ఖపు చేష్టలకి బలియై శిశిరంలోని తరువులా ఉన్న నా జీవితంలో ఆశాపలాశ రేకుల్ని దించి శాంతిని ప్రసాదించిన నీకు ఋణపడి పోతున్నాను."

ఉత్తరాన్ని పూర్తిగా చదువుకున్న రవిభూషణ్ క్షణకాలంపాటు స్తబ్ధుడై పోయాడు. ఒక మాతృ హృదయంలోని క్షోభను చిత్రించటానికి ఎన్నడో వ్రాసిన ఒక కథ ఇంతటి ప్రయోజనాన్ని సాధిస్తుందని అతడు స్వప్నావస్థలోనైనా అనుకోలేదు. తా నింతవరకు రచనా ప్రయోజనాలను గురించిన అభిప్రాయాల్లో కొన్ని మైలురాళ్ళను నాటాడు. కాని ఈప్రయోజనం తను ఊహించనిది ఈప్రయోజనం శాశ్వతమా నశ్వరమా అనే విషయమై ఆలోచించ మొదలిడితే గత ఘట్టాలన్నీ మస్తిష్కం చుట్టూరా పరిభ్రమించాయే కాని ఫలితం తేల లేదు. తను వ్రాసిన ఒక మామూలు కథ ఒక జీవిని సంతృప్తితో చనిపోయేట్లు చేసిందంటే రవిభూషణ్ పొందిన ఆనందం అది ఆనందమో ఆశ్చర్యమో కాని ఒక పరిమితి లేనిది. అతడు తదేకమైన చూపుతో రెండు చేతుల్లో ఉత్తరాన్ని పట్టుకున్నాడేగాని, ఆ మాతృదేవి మరణానికి సంతాపం వెలిబుచ్చాలో, తన కథ సాధించిన ప్రయోజనానికి సంతోషపడాలో తేల్చుకోలేకుండా ఉన్నాడు. *

*గేయకవిత* '

# నిష్క్రాంతి

— శ్రీ రామనాథం

అది శుద్ధోధన సామ్రాజ్యం-
మూడురకాలప్రజల మురిపపు పండుగదినమిది
సామ్రాజ్యం నలుమూలల సంతోషం వెల్లువ
రాజుగారి సంరంభం చెలియలికట్టను దాటెను

రాకొమరుడు, భవితవ్యపు రారాజు,
శుద్ధోదను ముద్దులపట్టి, సామ్రాజ్యపు యశోరాశి,
సద్గుణ సంపన్నుడు, ముళ్ళమధ్య గులాబి
గౌతముని వివాహదిన మది

మహోత్సవం జన సందోహానికి-
మహోత్సవం శుద్ధోదన హృదయంలో-
మహోత్సవం పెండ్లి కొమరిత లేతరంగు పెదవులపై
మమతలేని మాంద్యం - గౌతమ వేదనాహృదయ పరిధులలో

ఆనాటి వృద్ధమాత కనులముందు కనబడుచున్నది
ఆనాటి శవపుమోత దృష్టినుండి చెరుగలేదు
ఆనాటి భిక్షువుబాధ వీనులందు వినబడుచున్నది
ఒకనాటిది కాదీబాధ - ఒక మనిషిది కాదీదుఃఖం

పుట్టిన ప్రతిజీవికి తప్పవు పరిణామాలు
పుట్టిన ప్రతిజీవికి తప్పదు ఒకనాడు చావు
పుట్టిన ప్రతిజీవికి క్షుత్తుబాధ, రోగం, వృద్ధత్వం.
మసిలేని మానిసి హృదయంపై నల్లని సిరామరక.

ప్రఫుల్ల హృదయం కాదది-అపరిష్కృత సమస్యల భారం
ప్రసన్న వదనం కాదది-పరిధులు దాటిన ఆలోచన ముద్రలు-
ప్రణయపు సంపూర్ణత కాదది - పరివేష్టించే సంఘటనల
కూడలి స్థానం-
ప్రత్యక్షపు స్వర్గతలం కాదది పరిభ్రమించే ప్రశ్నలకిలాతలం

*[కొన్నివత్సరాల అనంతరం రాహులుడు జన్మించాడు]*

ఏదో బాధ హృదయంలో - నులివెచ్చని జ్వాలా కీలలా
ఏదో విషాదగాథ - దరిలేని సముద్రుని మనస్సులా-
ఏదో చూడలేని దృశ్యం-టార్చిలైట్లు చీల్చలేని చిక్కనితమస్సులా-
ఏదోవినలేని విపత్కర సంగీతం-పంగ్వంధులమూగవోయినస్వరంలా

'చెన్నా ! రథాన్ని సిద్ధంచెయ్ !
ఇది ఆజ్ఞగా పాలించు ! లేకుంటే కోర్కెగా మన్నించు!
యెదురు చెప్పబోకు ! యెందులకో అడుగరాదు !
ఎక్కడికని ప్రశ్నించకు ! ఇంతకన్న చెప్పలేను !'

'ఏమిటి సామీ ! యీ అర్ధరాత్రి-
చిట్టిబాబు ! చిన్నరాణి !
పెద్దవాడు తండ్రి ! కనకపోయినా మక్కువతో పెంచిన గౌతమి !
నిద్రోతున్నా రావల...... రథం సిద్ధంగానే వున్నది '

'పోనీ ! త్వరగా పోనీ ! ముక్కుకుసూటిగా !
అరణ్యా మధ్యంలోకి ! అంధకార బంధురంలోకి !
అజ్ఞాన తమస్సుకు దూరంగా నిశాంత ప్రకృతి సమీపానికి!
విజ్ఞుల సాన్నిధ్యానికి ! వింతకోర్కెల జీమూతానికి
దూరంగా !'

చెన్నా ! నీ కెందుకు నా మీ దీమమత !
ఆఖరిసారిగా చెప్పు - శ్రీమతికి చిరంజీవికి -
నా హృదయంనుండి వినిపించే ఆశీర్వచనాలని -
తండ్రిగారికి నమస్కృతులు - తల్లికి నా వందనాలు.

వ్యథపడటం వృథాశ్రమ-పతిత మానవలోకానికి పరిశ్రమ-
పుట్టిన వాడల్లా గిట్టకమానడు - చిరిగిపోయే కాయంపై
మమత మాధుర్యం దేనికి ?
వ్యథిత మానవలోకానికి-మంచిమందు కావా లిప్పుడు !
ఇదిగో నా ఆనవాలు-నీ సాయానికి నా నమస్కృతులు.'

జారెను - చంద్రుని తేజం భూగర్భంలోనికి -
జారెను - సూర్యుని కిరణా లీమహీతలం మీదకు -
జారెను - చెన్నుని కనులవెంట రెండశ్రు కణాలు -
జారెను - గౌతమహృద్వీథులలో నొక తెర !



ఉబుసుపోక

# తస్మాత్ - జాగ్రత్త!

— శ్రీ వెంకటేశ్వరరావు

శ్రీనివాసులులో యిటీవల కన్పిస్తున్న మార్పు గురించి నలుగురూ చెబితే నేను నమ్మలేదు గాని స్వయంగా చూసిన తర్వాత, పదిరోజులు గడిచిన తర్వాత నమ్మకపోవడం అసాధ్యమైన విషయంగా కన్పించింది. శ్రీనివాసులుయొక్క చరిత్ర ప్రసిద్ధి యేమిటని ప్రశ్నిస్తే దశాంశాలతో వచ్చే సమాధాన మేమిటనగా— అన్నిహంగులు తయారుగావుంటూ 27 సం॥ల వరకూ బ్రహ్మచర్యాశ్రమాన్ని, పూర్వాశ్రమంగా జీవితాన్ని నడపిన నూతన వివాహితుడు శ్రీనివాసులుకూడా పాంచ భౌతికనిర్మితమైన సాధారణ శరీరుడు. ఇంత మార్పులో విచిత్రమేమిటంటారేమో !

పూర్తి పేరెందుకు! శీను కొండవిరిగి మీదపడ్డా చలించని ధీరుల్లో లెక్కకట్ట దగిన మనిషి. వివాహం ప్రసక్తి వస్తే యింకా వేదాంతమార్గ మెంత దూరంలో వుందా! అన్నట్లు మాట్లాడే అవతారం శీనుది. పొరపాటున పూర్తి విరాగి అనుకుంటారేమో! అదికాదు. అన్ని రసాలు శాస్త్రశాస్త్ర రుచి చూస్తూ మొన్నమొన్నటివరకు సాహిత్యంలో యెంత లోతుకు దిగగలమా! అనుకుంటూ ఉదర నిమిత్తం వుద్యోగం నిర్వహిస్తున్న కలికాలపు పరమానవుడు. వివాహమంటే మరో ప్రపంచమనీ, పదండి - ముందుకు - పదండి త్రోసుకు అంటూ పూబిలో దిగేట్టు ముందుకు పోవడమేగాని, తిరిగి రాలేమని ఓ భావన స్ఫురిస్తోంటుంది శీను మాటల్లో. ఆకారణంచేతనే మా మిత్రుల వివాహ సందర్భాలలో తన అభినందనాలను ఓ చిన్న విస్ఫుహాతో అందజేస్తూండేవాడు.

"అబ్బాయి! ఇంతవరకూ మాతో ఒక రకపు జీవితానికి అలవాటుపడ్డావు. ఈనాటితో యీ అవతారం చాలించి కొత్త జీవితంలో పడబోతున్నావు. చాలా పెద్ద సుఖాన్ననుభవించబోతున్నావని కొంతమంది అనవచ్చు. నీవేమీ అనుకోకపోతే నా అభిప్రాయం చెబుతాను. అవేమీ నమ్మకు, ఊరికే విను! పొరపాటుగానైన పెద్దపెద్ద ఆశలు పెంచుకుని, ఆశావాదిగా జీవించకుసుమా! " అంటూ తస్మాత్ జాగ్రత్త వగైరా పరాకులు చెబుతూండేవాడు. వాస్తవానికి యీ అభినందనాలలో వ్యంగ్యంగా గాని, ధ్వనిగాని, తప్పుగాని లేకపోయినా యెదుటివారు మాత్రం యీ ప్రత్యేకపు టభినందనాలకు మనుఖులుగా తరచు వుండలేకపోయే వారు ఒకటి, రెండు సందర్భాలలో కాస్త ఘర్షణ జరిగిన మాటకూడ నిజం. కాని శీనులో ఘర్షణ పడుతున్న విరుద్ధభావాల నర్థం చేసికొన్న వారెవరూ నానార్థాలు తీయరు. ఇంతెందుకూ నా పెళ్ళిలో

"ఒరేయి! నీలో సంతోషం - వికాసం... యీరోజు యీ నిముషంతో మంగళం పాడేశాయి సంసారమనే సాగరంలో పడిపోతున్నావు! ఈ సాగరంలో నీ పడవ వాతావరణం సాఫీగా నున్నంతవరకూ చక్కగా పయనిస్తుంది గాలి తిరగ్గానే నీ ఆదర్శం ఛేదించి నీ పడవకు లంగరు పడుతుంది " అంటూ మొదలెట్టేసరికి ప్రొహిబిషన్ సర్వీసులోవున్న మా నాననరది 'శీను'కు మందు సేవించే అలవాటేమయినా వుందేమోనంటూ పెళ్ళిపందిట్లోనే దరియాప్తు చేశారు.

అలాంటి 'శీను' ఓ యింటివాడయిన వారంరోజుల్లో మారిపోయాడంటే నిజానికి ఆ యిల్లాలిని అత్యవసరంగా అభినందించాలి!

ఇదీ శీను పూర్వాశ్రమ వృత్తాంతం!

శీనుకు పెళ్ళయిన మూడవరోజునే కలుసుకొన్నాను. మరి పదిరోజులు కూడా గడిచాను. కాస్త మనసిచ్చి మాట్లాడినా, నా ఒక్కనితోనే సన్నిహితంగా ఉంటూవుండేవాడు.

"శీనూ! జీవితంలో యీ మార్పు నీలో ఎలావచ్చింది? భవిష్యత్తుమీద నీకు విశ్వాసం ఎలాకుదిరింది! ఈ మూడురోజుల్లోనూ, 27 సం. ల జీవితంలో లభించని మహత్తర సత్యాలేమిటి నీ మార్పు విషయంలో! ఆధారాలేమిటి ప్రకాశవంతమైన భవిష్యత్తుందని నీసంసార జీవితంలో? అసలు నీవు వివాహాని కెలా సమ్మతించావు?"

"ఒరేయి రాఘవుడూ! ఒక్కమాట విను మీఅందరి వివాహాలందు నేను యేవిధంగా అభివందనా లిచ్చానో నేను మరువలేదు. కానీ ఆ జాగ్రత్తలోనే నేనూ నిన్నటి క్రితము వరకూ వుండగలిగాను. ఇంక పెళ్ళి కెలాగ ఒప్పుకున్నానంటావు? అంతేనా! నీ దగ్గర దాచలేను ఆ అమ్మాయిని చూసిన తర్వాత ఒప్పుకోకుండా వుండలేకపోయానురా! "

"ఇంతకూ నీ మార్పుకు మీ శ్రీమతి కారణమంటావు? మరి నీ ఆదర్శాల మాటేమిటి! నీ నమ్మకా లేమయ్యాయి! విన్నా. నీ నమ్మకాలను యిట్టే మార్చేయ గల్గిన మీ శ్రీమతిని నిజంగా అభినందించాలి!"

"అవునురా నామనస్సులోని మాట చెప్పేకావు నీ దగ్గర నేనింతవరకు యేవిషయం దాచలేదు యింక దాచలేను కూడాను నాకు యింతవరకు స్త్రీని సరిగ్గా అర్థం చేసుకోడానికి అవకాశం, సమయం దొరకలేదు కనుకనే మీ కందరికీ గట్టుమీద కూర్చుని నా సాహిత్య దృష్టి నాధారంగా జేసికొని సలహా లిస్తూండే వాడిని అలాంటి నిరాశావాదిని, మా శ్రీమతి కటాక్షన ఆశావాదిగా మార్చేసి అంతటితో ఆగక అతివాదిగాకూడ మార్చేసిందిరా అబ్బీ!"

"ఆ! అదిరాసంగతి! అక్కడే నీకు నువ్వే జాగ్రత్త చెప్పుకోవాలి! మా కందరికీ ఊరికే సలహాలిస్తుండటం కాదు! మేమంతా వున్నచోటునే వుంటూ కాల ప్రవాహాని కెదురీదకుండా, సంసారములో ప్రవేశించాము. మరి నీ సంగతి? సంసారం - సాగరం - దుఃఖం అంటూ సంసారానికి ఎత్తుగా, దూరంగా యెగిరి సంసారంలో పడ్డావు! మరీ గట్టిదెబ్బ తగిలే అవకాశం నీకు మరింత యెక్కువగావుంది! కనుక నీ సలహాలు, హెచ్చరికలు, అభివందనాలు నీకే అవసరానికి హాజరుగా వుండటం మంచిది ఏం! అలాగ తెల్లబోతావేం! షేక్స్పియరు మొహం వేసికొని "

"అబ్బబ్బ! వుండరా! కాస్త నన్ను గుక్క తిప్పుకోనియ్యి! హృదయంలో పదిలంగా వున్న నాల్గుమాటలు అప్తులకు చెప్పుకోగానే హృదయం తేలిక పడ్డట్టుంది గదిలో ఒక్క అరగంట అసలు మొహాలు కూడ చూసుకోలేదురా! తర్వాత సగం కంగారుతో సగం దాహంతో గొంతుక తడి యారిపోయింది. ఇంక గత్యంతరములేక "ఇదిగో . ఇదిగో విన్నే కాస్త మంచినీళ్ళిస్తావా!" అన్నాను జవాబు కిమన్నాస్తి! మళ్ళీ కాస్త ధైర్యంచేసి అడిగాను ఊహూ! జవాబులేదు ఫలితంకూడ సున్న మరి కాస్త ప్రాధేయ పూర్వకంగా "పోనీ ఎక్కడున్నాయో చెప్పు! నేనే వెళ్ళి తీసుకుంటాను" అన్నాను. కాని నాప్రాధేయతలో వున్న మహత్తేమిటో నాకయితే తెలియదుగాని మా ఆవిడ వెంటనే లేచి తలుపు లాగబోయి గడియవేసిఉండడం గమనించి, లోపల గడియ వేసింది పకడ్బందీగా ఒరేయి చెప్పకుండా వుండలేను నాగుండెలు టక-టకా టక-టకామని కొట్టేస్తున్నాయి. "ఏమిటే! తలుపు లేస్తున్నావా! తీస్తున్నావా! " అని మాత్రం అనగలిగాను ధైర్యంగా "వేసేశాను" అంది.

"మరి నీళ్ళో! అయితే నీవు లేచింది మంచినీళ్ళకు కాదన్నమాట?" అన్నాను.

పెద్ద తప్పుచేసి దొరికిపోయిన దానిలా పెదవి కొరుక్కుంది. వెంటనే మంచంకిందనే వున్న మరచెంబు చేతికిచ్చింది. ఇదే అనుకో నా జీవితానికి Turning point ఈ సంఘటనే నాకు సంసారభవిష్యత్తుమీద అచంచల విశ్వాసాన్ని కలిగించి 'ఆశావాది'గా నన్ను మార్చింది.

మా సంసారం నవరసభరితంగా ముందుకు నిరత్యంతరంగా సాగిపోగలదని నా హృదయం వేయి గొంతులతో చెప్పినట్టయింది అంతవరకు నాలో గూడుకట్టుకొని ఘనీభవించిన 'నిరాశా వాదాన్ని' యీ మాటలు 'అదృశ్యం' చేశాయి దీనికి మా శ్రీమతి తగినట్టుగా హామీ యిచ్చింది

ఇంతకూ ! నువ్వు తలుపు యెందుకు వేశావూ ? అంటే

మావాళ్లు వేసికోమన్నా"రంది తల కిందికి వాల్చేసి నవ్వుతూ చమత్కారంగా !

—ఇదీ శీను 'జీవితానికి' కాంతి నిచ్చిన నాందీ ప్రస్తావన మావా దన్నట్లు యీ మార్పు యింతటితో ఆగిపోలేదు ఇంకా మా మిత్ర బృందంలో వివాహాలు కాకుండా మిగిలి పోయిన బ్రహ్మచారులమీద వత్తిడి ప్రారంభించి ఒకటి రెండు పెళ్ళిళ్ళు చేయించాడుకూడాను

ప్రస్తుతం 'శీను' సిద్ధాంతం— వివాహమనే కర్మకాండతోగాని సిందుమానవత్వం" యువకులకు సమకూడదని — అంతేకాదు— తన పూర్వాశ్రమపు హెచ్చరిక తస్మాత్ జాగ్రత్త కేవలం బ్రహ్మచారులకే వర్తిస్తుందంటాడు నిర్ధారంగా



# కవితాశబల

— శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

[ మిత్రులు శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు లమ శబల (ఖండికాసంపుటి) నాకు పంపారు దాన్ని చదువుతూ అత్యల్పకాలములో ఈ పద్యాలు వ్రాశాను ఎతత్కృతి' ఒక చిన్న సమీక్షగా దీన్ని ప్రచురిస్తున్నాను ]

పొదుగుల్ నిండి, సమగ్రరోచుల పయఃపూరమ్ము లాంధ్రోర్వికిన్
బిదుకంగాగల సాధు నీశబల, సంప్రీతిన్ గృహప్రాంగణం
బిది చేరంగని పూజసల్పినది నా యిల్లాలు తొల్దొల్త, ప్రే
మదృగంత స్ఫురితప్రసూనములు సొంపారన్ ఖురశ్రేణులన్

మీ కవితాసుమ మంజరి, పైకొని విసరెస్ ప్రశాంత పవనాంకురముల్
మా కవిసమ్రాట్టుల శోభాకలితరసార్ద్రిమధురవాక్చిచయంబుల్

అభిమానము నాపైగొని అభినవతిక్కన ! త్వదీయమగు కృతులనుపన్
ఉభయులను దన్ని మైత్రీవిభవపరీమళము నభము విరియన్ బ్రాకెన్

మేసెనా, వర్షధారా సముజ్జ్వలమైన
నవతృణాంకురముల నందు శబల
పిదికెనా, అమృతసంపదల రుచ్యములైన
క్షీరధారల నందజేయు శబల
చేరెనా, చనువిచ్చి శిశువులయెడ ప్రేమ
మిళిత లాంఛనముల మెలగు శబల
విహరించెనా, స్వైరవీథులబడి క్షేత్ర
భూముల విహరింపబోవు శబల

కమ్మకమ్మని యెడద నైక్యమ్మొనర్చి
మీరు పెంచినశబల, యీ భారతీయ
ధర్మసారము గురియుచు ధన్యమయ్యె
కాపుదల మీది తుమ్మల కవివరేణ్య!

అంతములేనిర క్తి, హృదయంబున మెచ్చుచు, విశ్వనాథ "సం
క్రాంతి తలంపు" పేర్కొనియె కాదనరాదిది, కర్షకుండవై
యెంత శ్రమించినావొ తొలియేడుల, నీ కలమే హలంబు, మా
పొంతల సాహితీ లలిత భూములు దున్నెదు పైరునాటుచున్

*(మందాక్రాంత)*

యాతాయాతాధ్వగజన మనోహారి పానీయశాలా
ఖ్యాతిన్ నిల్పెన్ లలిత గతులన్ కావ్య ఖండంబు లందున్
వాతోద్ధూత ప్రసవచయముల్ వంగి వర్షించు మేఘ
వ్రాతంబయ్యెన్ వివిధగుణ సంక్రాంతముల్ కావ్యమాలల్.

ప్రాత స్సంధ్యల్ సరస కవితాస్వాదుదుగ్ధమ్ము లింటన్
చేతః ప్రీతిన్ గొలిపి పిదుకున్ సేవగావింతురేనిన్
పూతంబయ్యెన్ జగతి శబలా పూజ్య భావంబులోనన్
సీతారామా, కవివర యశశ్శ్రీలు నిన్నున్ వరించెన్.



కవిత:

# శాంతిదూత

—శ్రీ చావ నారాయణరావు

అది సువిశాలమౌ నగర, మా నగరంబున కోట, కోటలో
నది రమణీయమౌ భవన, మా భవనంబున యర్ధరాత్రి, తా
మది దలపోయుచుండె సుకుమారు డొకండు తదేకదృష్టితో
నిదురకు దూరమై మనసునిల్పి,...మనోరథమేమొ, యింతకున్.

అతని ముఖాకృతిన్ గనిన యంతనె దోచు దయానముద్రు డౌ
యతఁ డొక రాజపుత్రు డని, యాతని యాశయ మేమొ; యత్తరిన్
సతమత మౌచు నట్టె యొక జాముకు సాచె పదంబు ముందుకున్
మతి యెటు లాగెనో! యడుగుమాత్రము సాగకపోయె నింతకున్.

దడదడలాడు గుండియ నిదానముగా నొక చేతబట్టి తా
నడుగిడలేదు,...రెండు గడియల్ దరిదోచక నొంటికాలిపై
గడపెను, జాలసాగె నధికంబుగ కన్నుల నశ్రుబిందువుల్
కడ కతడు - అప్రయత్నముగ తా నటు వెన్కకువైచె నడ్యోడన్.

భారముతో నతండు తల వాల్చి క్షణం బటు లుండి గ్రక్కునన్
కారణ మేమొ! తోచదు!! మొగం బటు వెన్కకు ద్రిప్పిచూచె, నా
చేరువ నేమి యున్నదో!! విచిత్రము!!! తా చిరునవ్వునవ్వె; సం
సారపు భ్రాంతి కాదుగద! సందియ మేల! యదే తలంపగన్..

ఆ నడిరేయి మైమరచి హాయిగ నా గదియందె పాన్పుపై
యా నిదురించు తల్లిమెడయందలి హారగు చేతబూని, యొ
డ్డాణము గాలదన్ని పయటన్ బడద్రోయుచు స్తన్యమానుచున్
ఖానునిరీతి నా మెరయు బాలుని వీడగ మాటలా!... యతం
డానిమునంజె బాలుని నయమ్ముగ ముద్దిడబోయె చెంతకున్.

మనసున నేమితట్టెనొ! కుమారుని ముద్దిడబోయి నిల్చె, ప్ర
క్కన ప్రియురాలి సోయగముగాంచి చలించియు తగ్గె వెన్కకున్
మన సొక రాయి జేసికొని మక్కువవీడి తదేకదీక్షతో
జనె గదితల్పులన్ దెరచి సౌధముడిగ్గి యతండు ధీరతన్—

తరుగని రాజ్య సంపద, సుధామయ సూక్తుల ముంచితేల్చు సుం
దరి యధరామృతంబు, నిరతంబు చిరాయువుగోరి ప్రేమతో
మురిసెడి తల్లిదండ్రుల యమూల్యపు ప్రేమయు నిచ్చగింపక...ఆ
కరణి నతండు నిల్వడలె కారణమేమొ! దురూహ్యమారయన్.

తెలతెలవారలేదు, తన ధ్యేయ మదేమొ! యెరుంగరాదు, తా
నిలిచె యరణ్య మధ్యమున,— నిశ్చల చిత్తముతో తపంబులన్
సలిపెను కొన్నియేడులు ప్రశాంతముగా,— తుదకేమి దోచెనో
తెలియదు, లేచి సాగె నొక తీరని యోచనతో విరాగియై

చనియొక కొంతదూరము ప్రశాంతముగా నొక రావిచెట్టు చా
యను కరమూని కూర్చొని ముఖాబ్జమునెత్తి, యొకింత సేపు, తా
కనుగవమూసి లోనరసి క్రమ్మరలేచె, నతండు బాల భా
నునివలె దోచె మోమున వినూత్న వికాసము జిందులాడగన్.

అంత విరాగియయ్యె నపుడా సుకుమారుడు,— లేచి నూత్న సి
ద్ధాంతము సృష్టిజేసె, నిల ధర్మప్రబోధము సల్పె ఖండ ఖం
డాంతరముల్ భళీ! యన; నహర్నిశలున్ కృషిజేసె జీవితం
బంతయు విశ్వశాంతికయి యమ్మహనీయుడు బుద్ధదేవుడై.



వ్యా స ము :

# మళయాళసాహిత్యము - మధ్యయుగము

—శ్రీ ఆర్. కె. రావు

## దేశస్థితి

1018 సంవత్సరంలో చోళదేశపురాజు రాజేంద్రచోళుడు కేరళ దేశంలోని చివరి పెరుమాళ్ రాజు భాస్కర రవివర్మను యుద్ధంలో ఓడించి అతని కిరీటాన్ని దొంగిలించి తీసుకొని పోయినాడు. అంతతో కేరళ దేశంలో పెరుమాళ్ రాజుల రాజ్యం అంతమైపోయింది అంతకుముందుగానే కోలత్తునాడు, వేణాటురాజులు స్వతంత్రులైనారు కొచ్చిలో పెరుమాళ్ వంశస్థులే రాజ్యం చేస్తుండేవారు 14 వ శతాబ్దం ప్రారంభంలో వేణాటు నాలుగు స్వతంత్రరాజ్యాలుగా విభాజితమై పోయింది 1 తూప్పాప్పురమ్ 2. కోల్లమ్ 2 కోట్టారక్కరా 4 కాయంకుళమ్- ఇవి అన్నీ స్వతంత్రరాజ్యాలే అయినా అన్నీ మైత్రీభావంతో ఉండేవి. ఇదేవిధంగా ఉత్తర కేరళంలో ఎర నాటు, వల్లువనాటు మొదలగు రాజ్యాలు స్వతంత్రమైనవి. కొచ్చిన్‌కు దక్షిణంగా కోట్టయమ్, వెట్టత్తునాటు వటక్కుంకూర్, చెంపకశ్శేరి మొదలగు చిన్న చిన్న రాజ్యాలు ఏర్పడ్డవి. సారాంశమేమంటే పెరుమాళురాజుల తరువాత కేరళదేశం అనేకమైన చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలుగా చీలి పోయింది ఆయాదేశాల అధిపతులు మళయాళ సాహిత్య వికాసానికి అధికంగా తోడ్పడ్డారు.

ప్రజలలో ఎక్కువమంది నాయరుజాతివారు రాజులు ప్రతి విషయంలో వారి సలహాలను తీసుకొనేవారు. వారే సేనలో గూడా ఎక్కువగా ఉండే వారు. సంఘంలో ఆర్య బ్రాహ్మణులకు ప్రాముఖ్యత ఎక్కువగా ఉండేది. బ్రాహ్మణులు నాయర్ స్త్రీలను వివాహమాడి ఆజాతితో సంధిచేసుకొన్నారు. ఆ బ్రాహ్మణులు సంస్కృతంలో విద్వాంసులుగా ఉండేవారు. దేశభాషను స్వీకరించడం అవసరమని వారు గ్రహించారు. అందువలన వారు ఆ మళయాళ భాషను నేర్చుకొన్నారు. ఏమైనా వారి మళయాళభాషమీద సంస్కృతభాషా ప్రభావం పడక తప్పలేదు సంస్కృత శబ్దమిశ్రితమైన భాష నెమ్మదిగా సాహిత్యంలోనికి ప్రవేశించసాగారంభించింది. దానితో మణిప్రవాళశైలి మళయాళంలోనికి ప్రవేశించింది.

మళయాళభాషలోని లక్షణగ్రంథం లీలాతిలకంలో "భాషా సంస్కృత యోగో మణిప్రవాళం" అని నిర్వచించబడి ఉన్నది. మళయాళభాషలో ప్రవేశించిన సంస్కృతశబ్దాలు ఆ భాషలో కలసిపోవాలి మణిప్రవాళశైలి విశిష్టమైనది వైష్ణవ జైనాచార్యులు ఈ శైలిని బాగా వ్యాప్తిలోనికి తీసుకొనివచ్చారని ప్రసిద్ధి

ఈ యుగంలోని సాహిత్యం భాషాభేదాన్ని బట్టి రెండురకాలుగా ఉన్నది. ఒకటి పురాతనమైన తమిళ ప్రభావపూరితమైనది రెండవది మణిప్రవాళమునకు సంబంధించినది మొదటిరకపు భాషలో రామచరితము, కణ్ణశ్శ రామాయణము రెండు ముఖ్యమైన గ్రంథాలు. వైశికతంత్రమ్, ఉణ్ణునీలి సందేశ్, కోకసందేశ్, చెరియాచ్చివర్ణణ మొదలగు కావ్యగ్రంథాలూ, ఉణ్ణియాచ్చి చరిత్, ఉణ్ణిచ్చిరుతేవి చరిత్, ఉణ్ణియాటి చరిత్ మొదలగు గద్య పద్యమయ గ్రంథాలూ మణిప్రవాళ సాహిత్యంలో ప్రసిద్ధమైనవి.

## 1 భాషాసాహిత్యము – కృతులు

రామచరితమ్ ఇది మళయాళభాషలోని ప్రాచీన కావ్యము పాట్టు ఛందము ననుసరించి ఇది రచింపబడినది కథ రామాయణంలోనిది కాని దీనిలో రామాయణకథ అంతా లేదు కేవలం యుద్ధకాండమాత్రం వర్ణింపబడ్డది. తిరువితాంకూర్ రాజు ఆదిత్యవర్మ తన సైన్యాన్ని ఉద్బోధించడానికి ఈ కావ్యాన్ని రచించాడని కొంతమంది అంటున్నారు ఈ గ్రంథంలో ఒక చోట కవి పేరు ఉన్నది చీరామ్ అనేది ఆ పేరు చీరామ్ అంటే శ్రీరామ్ అనేదానికి తద్భవరూపము దానినిబట్టి తిరువితాంకూర్ రాజు శ్రీరామవర్మ గ్రంథకర్త అని కొంతమంది అంటున్నారు

ఈగ్రంథంలో మొత్తం 164 పరిచ్ఛేదాలున్నవి ప్రతి పరిచ్ఛేదంలోనూ సుమారు 11 నుండి 12 వరకు "పాట్టులు" ఉన్నవి మొత్తం 1814 "పాట్టు"లు ఈ గ్రంథంలో ఉన్నవి ప్రతి పరిచ్ఛేదంలోనూ వేరు వేరు ఛందస్సులు ఉపయోగింప బడ్డవి. దాదాపు వాటిసంఖ్య 20 వరకు ఉన్నది. అన్నీ ద్రావిడ ఛందస్సులే. "పాట్టు" కు సంబంధించిన ఛందోనియమాలన్నీ వీనిలో సంపూర్ణంగా అనుసరింపబడ్డవి.

ఈ కావ్యం ప్రాచీనతమమైనందుననూ, తమిళశబ్దాలు ఈ కావ్యంలో ఎక్కువగా ప్రయోగింప బడడంవల్లనూ చాలామంది తమిళ విద్వాంసులు

అది తమిళ కావ్యమని అంటున్నారు. వీరరచన ప్రధానమైన ఈగ్రంథం మలయాళ సాహిత్యంలో ఒక అమూల్యమైన రత్నము.

## 2 రామకథపాట్టు - మావారతమ్‌పాట్టు

రామకథపాట్టు గ్రంథకర్త అయ్యపిళ్ల ఆశాన్. అతడు నెయ్యాటింకర జిల్లాలోని ఔవాట్టునురా గ్రామస్థుడు ఇంతకంటె ఎక్కువ ఈ కావ్యాన్ని గురించి ఏమీ ఇంతవరకు తెలియలేదు

మావారతమ్‌పాట్టు రెండవకావ్యం మావారతం మహాభారతానికి తద్భవం కావచ్చును ఈ కావ్యంలో మహాభారతంలోని కథ వర్ణించబడి ఉన్నది. గాంధారి ఒక దినము కుంతి పిల్లలను చూడవలెనని తన యింటికి పిలిపించుకొంటుంది భీముడుగూడా వస్తాడు గాంధారి భీముణ్ణి మోసగించి చంపివేయవలెనని ప్రయత్నం చేస్తుంది కాని భీముడు తప్పించుకొంటాడు ఈ ఘట్టంతో కావ్యం ప్రారంభమవుతుంది. ఈ కావ్యంలోని ఒక "పాట్టు"ను చూడండి.

కురునాట్టిలమ్మ కాంతకారి కురునాట్టిలమ్మ కుంమతేవి
కుంచుతేవి పెట్ట మక్కళే కోల్లామ్ అంచుమ్ ముటివేచ్చ పాండవన్మార్
కాంతకారి పెట్ట మక్కళే చోల్లామ్ తొణ్ణుట్టోం వతల్లో తురిమోతవరు.

## 3 కణ్ణశ్శ రామాయణమ్

రామప్పణిక్కర్ ఈ కావ్యకర్త ఇతనినే కణ్ణశ్శ పణిక్కర్ అనిగూడా అంటుంటారు తిరువితాంకూర్ ప్రాంతంలో తిరువల్ల తాలూకాలోని నిరణమ్ అనే గ్రామంలో ఒక శివాలయ మున్నది ఆ శివాలయం పశ్చిమభాగంలోని పేటకు కణ్ణశ్శపురంపు అని పేరు. అది ఈమహాకవి జన్మస్థానం ఈయనకు ఇద్దరు సోదరులున్నారు. వారు గూడా కవులే. వీరు ముగ్గురినీ నిరణమ్ కవులని గూడా అంటుంటారు వీరిలో పెద్దవాడు మాధవప్పణిక్కర్. ఆయన భగవద్గీతను రచించాడు రెండవవాడు శంకరప్పణిక్కర్. ఆయన "భారతమాల"ను రచించాడు. వీరు ఏకాలంనాటివారు అనేది ఇంకా వివాదాస్పదమైన విషయంగానే ఉన్నది. ఇంతవరకు లభించిన ఆధారాలనుబట్టి వీరు 14 వ శతాబ్దం చివరిరోజుల్లో జన్మించి ఉంటారని తెలిసినది. కణ్ణశ్శప్పణిక్కర్ ఉదయ్యంతో మలయాళ సాహిత్యంతో అరుణోదయమైనదని చెప్పవచ్చును. ఆతని ముఖ్యకృతి రామాయణము. అతడు వాల్మీకి రామాయణాన్ని అనుకరించి రచనలు సాగించినా చాలాచోట్ల స్వేచ్ఛగా మార్పులు [illegible]

ఈ కావ్యంలో సంస్కృత శబ్దాలు విరివిగా ఉపయోగింపబడ్డవి. అతడు ఉపయోగించిన ఛందాలకు నిరణమ్ ఛందాలని పేరు ఏర్పడ్డది. ఈ ముగ్గురు సోదరులు కృష్ణభక్తులు. ఇవేగాక ఈ యుగంలో చాలా రచనలు వెలువడ్డవి. లీలాతిలకమ్‌లో కొన్నింటిపేర్లు ఉదహరించబడ్డవి. లీలాతిలకమ్‌లో లభించే ఉదాహరణ గీతాలుతప్ప కావ్యాలు లభించడంలేదు

## 4 మణిప్రవాళ కృతులు

లక్షణ గ్రంథాలలో మణిప్రవాళ కృతులకు ఉదాహరణలు చాలా దొరుకుతున్నవి పుస్తకాలు ఇంతవరకు లభ్యం కాలేదు దొరికిన మణిప్రవాళ కృతులలో అన్నింటికంటె ప్రాచీనతమమైనది ఉణ్ణునీలి సందేశము మహాకవి కాళిదాసుని మేఘదూత కావ్యంతో సందేశకావ్యములు ప్రారంభమైనవి కేరళదేశంలో సంస్కృత కవులు శుకసందేశము, కోకసందేశములాంటి సందేశకావ్యములను వ్రాసియుండిరి మణిప్రవాళశైలిలో వెలువడిన మొదటి సందేశకావ్యము ఉణ్ణునీలి సందేశము. ఈ కావ్యాన్ని ఎవరు రచించారు? ఏకాలంలో రచించారు? అనేది ఇంతవరకు ఇంకా నిర్ధారణ కాలేదు ఈకావ్యం 14 వ శతాబ్దం చివరిభాగంలో కావ్యంలోని కథానాయకుడే వ్రాసిఉంటాడని పండితులు అభిప్రాయపడుతున్నారు

ఈ కావ్యంలోని కథ చాలా మనోరంజకంగా ఉన్నది తిరువితాం కూర్‌లోని వైక్కమ్ జిల్లాలో కటత్తురిత్తి ఒక ద్వీపము దానిని సంస్కృతంలో సింధుద్వీపమని అంటారు (కటత్=సింధు, తిరుత్తి=ద్వీపము) అక్కడి "ముండక్కల్" అతి ప్రాచీనమైన వంశము కథానాయిక ఉణ్ణునీలి ఒకరోజు రాత్రి ఆమె తన నాయకునితో గూడా గదిలో నిద్రించే సమయంలో ఒక యక్షిణి నాయకుని తీసుకొని దక్షిణ దిక్కువైపుకు వెళ్లిపోతుంది తిరువనంత పురం చేరిన తరువాత నాయకునికి నిద్ర మెళుకువవచ్చి నృసింహజపం చేయడం ప్రారంభిస్తాడు ఆ మంత్ర ప్రభావానికి భయపడి యక్షిణి అతనిని అక్కడే వదలి వెళ్లిపోతుంది అప్పటికి బాగా తెల్లవారుతుంది నాయకుడు తాను పద్మనాభస్వామి ఆలయంలో ఉన్నట్లు తెలుసుకొంటాడు. అక్కడ అతనికి తనమిత్రుడు కోల్లమ్‌రాజు ఆదిత్యవర్మ కనిపిస్తాడు. తన విరహవేదనను తన కథను అతడు ఆదిత్యవర్మకు తెలియజేస్తాడు. అతని ఆరోగ్యం గూడా చెడిపోతుంది. ఆదిత్యవర్మను సందేశవాహకునిగా తన ప్రియురాలి దగ్గరకు పంపుతాడు.

మందాక్రాంతా వృత్తంలో రచింపబడిన ఈ కావ్యంలో సుమారు 240 వృత్తాలున్నవి. అవి రెండు భాగాలుగా ఉన్నవి. పూర్వార్ధంలో మార్గము, ఉత్తరార్ధంలో సందేశము వర్ణింపబడ్డవి. తిరువనంతపురంనుండి కటత్తిరుత్తివరకు గల ప్రకృతి దృశ్యాలు ఎంతో హృదయానందకరంగా వర్ణింపబడ్డవి.

14 వ శతాబ్దంనాటి గ్రంథం కావడంవలన చిత్ర విచిత్రాలైన ఎన్నో శబ్దాలు ఇందులో మనకు దొరుకుతున్నవి మహాపండితుడు ఉళ్ళూరు పరమేశ్వరయ్యర్ గారు అన్నట్లు మళయాళ సాహిత్యంలో ఇది ఒక అనుపమానమైన గ్రంథము.

## చంపూ కృతులు

ఈ యుగంలో మళయాళ సాహిత్యంలో చంపూ కావ్యాలుగూడా విరివిగా వెలువడ్డవి దండి రచించిన కావ్యాదర్శంలో చంపూ కావ్యలక్షణాలు వర్ణింపబడి ఉన్నవి. "గద్య పద్య మయం కావ్యం చంపూ రిత్యభి ధీయతే" గద్యపద్య మయమైన కృతి చంపూకృతి ఈ విధానం సంస్కృత సాహిత్య ప్రభావంవల్లనే మళయాళ భాషలోనికి ప్రవేశించినది మొదటి మళయాళీ చంపుకావ్యం "అమోఘరాఘవమ్" 18 శతాబ్దం చివరి రోజుల్లోనే మణి ప్రవాళ శైలిలో చంపూ రచన ప్రారంభమైనది ఆనాటి చంపువులలో మూడు ప్రధానమైనవి 1 ఉణ్ణియాచ్చి చరితమ్. 2 ఉణ్ణిచ్చిరుతేవి చరితమ్ 3. ఉణ్ణియాటి చరితమ్.

ఈ కావ్యాలలో పౌరాణిక కథలద్వారా ఆనాటి సాంఘిక పరిస్థితులు వర్ణింపబడ్డవి ఈ మూడింటిలోని విషయమూ ఒకటే ఏ ఇంద్రుడో, చంద్రుడో గంధర్వుడో మళయాళీస్త్రీని ప్రేమిస్తాడు, కథను వివరించేటప్పుడు గద్యమూ, వర్ణన భాగంలో పద్యమూ నడుస్తుంటవి ఈ గ్రంథాలు ఇంతవరకు సంపూర్ణంగా దొరకనేలేదు.

పై గ్రంథాలవలన ఆనాటి కేరళదేశపు పరిస్థితులను మనం తెలుసుకొనగలుగుతాము. ఆ రోజుల్లో స్త్రీలకు సర్వవిధాలా స్వాతంత్ర్య ముండేది. వారు ఎవరికీ బానిసలుగా ఉండేవాళ్లుకారు. విడాకులు ఇవ్వడానికి వారికి పూర్తిగా అధికారం ఉండేది ఈ విషయాలు ఉణ్ణినీలి సందేశమ్, లీలా తిలకమ్‌లాంటి గ్రంథాలవల్ల మనకు తెలియగలవు.

## లక్షణ గ్రంథం - లీలాతిలకమ్.

లీలాతిలకమ్ మలయాళ భాషలోని ప్రాచీనతమమైన లక్షణ గ్రంథము కావ్యప్రకాశ్, సాహిత్య దర్పణములవలె లీలాతిలకమ్ సంపూర్ణమైన గ్రంథమని చెప్పడానికి అవకాశంలేదు దీనిలో ఎనిమిది అధ్యాయాలున్నవి అధ్యాయాలను శిల్పం అని అంటారు మొదటి శిల్పంలో మణి ప్రవాళ లక్షణాలు, వాటి విభాగాలు, రెండుమూడు శిల్పాలలో వ్యాకరణనియమాలూ, నాలుగో శిల్పంలో కావ్యదోషాలూ, ఐదులో కావ్యగుణాలూ, ఆరు ఏడు శిల్పాలలో వరుసగా శబ్దాలంకార, అర్థాలంకారాలూ, ఎనిమిదిలో మీమాంసా వర్ణింపబడ్డవి పాణిని సూత్రాలవలెనే ఈ గ్రంథంలో గూడా మొదట సూత్రమూ, తరువాత వృత్తి రచింపబడ్డవి అన్ని ఉదాహరణలూ మణిప్రవాళ పద్ధతిలోనే ఉన్నవి కొన్ని ''పాట్టు''లు గూడా లేకపోలేదు

ఈ గ్రంథాన్ని రచించిన వారెవరో ఇంతవరకు తెలియలేదు మహా పండితు డెవరో ఈ గ్రంథాన్ని రచించారని మాత్రమె తెలుసుకొని సంతృప్తి పడవలసిఉన్నది



కవిత

# కరుణామూర్తి

—శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

పుణ్యాంగనా శిరోభూషణంబైన మా
యాదేవి సుతుడవై అవతరించి
నిర్మల ప్రణయ చంద్రికయా యశోధరన్
పేర్మి యిల్లాలుగా స్వీకరించి
రుగ్ణాదులైన ఆర్తుల దుర్దశను గనుం
గొని గాఢ వైరాగ్యమును వహించి
ఎలమి నంతర్వాణి పిలుపు పందుకొని లేచి
దార పుత్రాది బంధములు త్రెంచి

రాజ్యభోగములను రమ్యమ్ములగు పదా
ర్థములు వదలి అర్ధరాత్రివేళ
ఊరువెడలి వనముచేరి మహాబోధి
తరువునీడ తత్వ మరసినావు.

ఓ మహనీయ! మానవ మహోదయ భావితభావ! దేవ! హిం
సామయమౌ ప్రపంచమున సంకటముల్ గనినంత సింధు గం
గా మధురాంబుపూరములుగా ప్రవహించెను ఓ ప్రభూ! దయా
ప్రేమలు రెండు నీ నయన వీధుల లోకము ప్లావనంబుగాన్.

మనసు తీపి, మాట మరి తీపియై తప్త
మానసముల తేనెవాన కురిసి
మానవ ప్రకృతిని మాధుర్యమయముగా
చేసినావు విషము తీసినావు.
ఆసియాకు హృదయమైన హిమాలయ
పర్వతమ్మువంటి వాడ వీవు
ఇట్లుగాకయున్న ఇంతటి యౌన్నత్య
మింత చల్లదనము ఎట్లు గలుగు?

నీ జాలి పల్కువందిట విరిసిన ఒక్క
పూవైన వసివాడిపోవలేదు
నీ పాదధూళి చిందినచోట ఒక్క మృ
త్కణమైన నెత్తుట మునుగలేదు
నీ స్నిగ్ధ దృక్కుల నీరాడి ఒకచిన్న
తృణమైన నీచత్వ మెనయలేదు
నీ దయా హృదయ సన్నిధిగన్న మనిషిలో
అణువైన ద్వేషమ్ము నందలేదు
నీ ప్రభావంబు పండు వెన్నెలలుగాయ
కొండగుండెలు కరగి అఖండ శిల్ప

కల్పనా దివ్యరూపముల్ గా రహించె
పూర్ణ పరమార్థ తత్త్వ (శ్రీ) బోధిసత్త్వ!

పూనికతోడ మన్మథుని ముద్దు కుమార్తెలు వచ్చి ఎన్ని లీ
లా నటనాది చేష్టల వలల్ వయిపై ప్రచురించినన్ రవం
తైనను నీ పవిత్ర హృదయమ్ము చలింపగలేదు ఓ మహా
జ్ఞాన కళాకృతీ! సుకృతి! శైలము గాలికి తూలిపోవునే!

గాయపడిన మేటి రాయంచపై కుంటి
గొఱ్ఱెపిల్ల బ్రతుకు గొడవపైన
వెల్లివిరిసి జగమునెల్ల లోగొన్న నీ
ప్రేమ నెవడు తూచి విలువగట్టు?

దేశా లన్నియు నేడు మారణ రణో ద్విగ్నావభగ్నమ్ములై
ఆశాపూర్ణములైన నేత్రములు విప్పారన్ నిరీక్షించు, హిం
సా శూన్య మ్మగు నట్లు నీ నిలుపు ధర్మజ్యోతి కల్యాణ సం
దేశమ్ముల్ ప్రకటించి విశ్వమున శాంతిన్ గూర్చుతన్ నిత్యమై

కరుణామూర్తీ! సుగుణా
భరణా! సంసరణ తరణ! పతితోద్ధరణా!
శరణాగత జనసేవిత
తరుణారుణ చరణ! దుఃఖతాప విహారణా!



# హిందీప్రచార శిక్షణశిబిరము, శివరామపల్లి

హైదరాబాదు నగరానికి ఆరుమైళ్ల దూరంలోనున్న శివరాంపల్లి గ్రామ సేవా కేంద్రంలో మే నెల 5 వ తేదీనుండి 15 వ తేదీవరకు హైదరాబాదు హిందీ ప్రచారసంఘ యాజమాన్యాన హిందీ ప్రచార శిక్షణ శిబిరం జయ ప్రదంగా నడపబడినది హిందీ వ్యాప్తికి నిరంతరం కృషిచేస్తున్న ప్రముఖహిందీ కార్యకర్తలు 18 మంది హైదరాబాదులోని వివిధ జిల్లాలనుండి శిబిరంలో పాల్గొన్నారు శ్రీ పి నారాయణగారు శిబిరపతిగానూ, శ్రీసోమనాథ్‌గారు ఉపశిబిర్పతిగానూ ఉండి శిబిర కార్యక్రమాన్ని జయప్రదంగా నడిపించినారు

దైనిక కార్యక్రమం :

ప్రతిదినం ఉదయం గం 4-30 లకు ప్రార్థనతో ప్రారంభమైన కార్య క్రమం సామూహిక సఫాయీకతాయీలతోనూ, విద్వాంసుల ఉపన్యాసాల తోనూ రాత్రి 9 గంటలకు ముగిసేది. శ్రీరామకృష్ణ ధూత్‌గారు ప్రార్థన కార్యక్రమమును, శ్రీమతి వీరమణిదేవిగారు కతాయీ కార్యక్రమమును నిర్వహించినారు

శిబిర ప్రారంభం :

మే నెల 5 వ తేదీ సాయంత్రం గం 6 లకు శిబిర ప్రారంభోత్సవం జరిగినది హైద్రాబాదు రెవిన్యూశాఖ ఉపమంత్రి శ్రీ వల్లెర్ల హనుమంతరావు గారు అధ్యక్షత వహించిరి శ్రీరామకృష్ణ ధూత్‌గారు అతిథులకు స్వాగతమును తెలియజేసిరి సంఘకార్యదర్శి శ్రీ ఆంజనేయశర్మగారు శిబిరోద్దేశ్యములను వివరించిరి శిబిరపతి శ్రీ నారాయణగారు దైనిక కార్యక్రమమును విశ దించిరి. శ్రీ వెంకటలాల్ ఓఝాగారు శిబిరముల ప్రాముఖ్యతమ గురించి ఉపన్యసించిరి.

ఉపన్యాసములు :

ఆశ్రమంలోని గున్నమామిడి నీడలలో ఉత్సాహ పూరితమైన వాతా వరణంలో శిబిరం తరగతులూ, ఉపన్యాసములూ జరిగినవి. వివిధవిషయములపై ఉపన్యసించినవారు :

1. శ్రీ మునీంద్ర B. A. — ఆధునిక హిందీ సాహిత్యము
(కల్పన సంపాదకులు)

2. శ్రీ ఆర్. యం. జోషి M. A. — నాగరిక శాస్త్రమూల సిద్ధాంతములు
3. శ్రీ రామానంద్ జీ — జీవితము–సత్సంగము
4. శ్రీ మాన్వి నరసింగరావు M. A. — ఆధునిక కన్నడ సాహిత్యము
5. శ్రీ రాజ కిశోర్ పాండే M. A. — హిందీ సాహిత్యంలోని ముగ్గురు ప్రముఖ కవులు సూర్, తులసీ, కబీరు
6. శ్రీ ఇల్లిందల సీతారామారావు M Sc. — పాఠశాలల సంఘటనము
7. శ్రీ వేమూరి ఆంజనేయశర్మ — 1 హిందీ ప్రచారోద్యమం పుట్టు పూర్వోత్తరాలు.
   2 దక్షిణభారత హిందీప్రచార సభ పరిచయము
   3 సంఘటనము
   4 ఆధునిక తెలుగు సాహిత్యము
8. శ్రీ సత్యనారాయణలోయా B. A., B. L., — సామాన్యుని జీవితంమీద కేంద్రప్రభుత్వం బడ్జటు ప్రభావం
9. శ్రీ సేతుమాధవరావు I. A. S. — హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర
   (విద్యాశాఖ కార్యదర్శి)
10. శ్రీ పి కె ఆంథోనీ — రెండవ పంచవార్షిక ప్రణాళిక
11. శ్రీ వెంకటలాల్ ఓఝా — పత్రికలు
12. శ్రీ జగమోహనలాల్ చతుర్వేది B. Sc. B. T. — వర్తమాన శిక్షణ ప్రణాళిక
13. శ్రీ తేజనారాయణలాల్ M A. — మనోవిజ్ఞానము–శిక్షణ పద్ధతి
14. శ్రీ కృష్ణమూర్తి అయ్యర్ — దక్షిణభారత హిందీప్రచారసభ బడ్జెటు
15. శ్రీ స్వామీ రామానందతీర్థ — రాజకీయ వాదములు
16. శ్రీ తిరుమలరావు — బేసిక్ ఎడ్యుకేషన్
17. శ్రీ హమీదుద్దీన్‌షాహిద్ M. A. — ఆధునిక ఉర్దూ సాహిత్యము

**హస్తలిఖిత పత్రిక :**

శిబిరంలోన్ని కార్యకర్తలు సంగమ్ అనే పేరుతో హిందీలో ఒక హస్త లిఖిత పత్రికను వెలువరించిరి.

కవి సమ్మేళనం :

మే 15 తేదీ సాయంత్రం శ్రీ జె వి నరసింగరావుగారి అధ్యక్షతన కవి సమ్మేళనం జరిగెను ప్రసిద్ధ హిందీ, తెలుగు, ఉర్దూకవులు సమ్మేళనంలో పాల్గొనిరి శ్రీ సి నారాయణరెడ్డి, కమల ప్రసాద్ కమల్, శ్రీమతి శైల బాలాదేవి, హమీదుద్దీన్ షాహిద్, పి నారాయణ, జనాబ్ ఖుర్షీద్ అహమ్మద్, ఇషరత్, తేజ నారాయణలాల్, సర్వర్ డండా తమ రచనలను చదివి విని పించిరి శిబిర చరిత్రలో ఈ కవిసమ్మేళనం ఒక మధురమైన ఘటన

శిబిర సమాప్తి ఉత్సవము

మే 15వ తేదీ సాయంత్రం 5-30 గంటలకు శిబిరసమాప్తి ఉత్సవం జరిగెను హైదరాబాదు ప్ర దేశ కాంగ్రెసు సంఘాధ్యక్షులు శ్రీ జె వి నర సింగరావుగారు అధ్యక్షత వహించిరి శ్రీ సి. నారాయణరెడ్డిగారు "సంగమ్" పత్రికను ఆవిష్కరించిరి శ్రీ నరసింగరావుగారు శిబిరవాసులకు యోగ్యతా పత్రములను పంచిపెట్టిరి సంఘ కార్యదర్శి శ్రీ ఆంజనేయశర్మగారు ధన్యవాద సమర్పణ గావించిరి

భోజన వసతి

శిబిరంలో ప్రవేశించిన కార్యకర్తలందరికీ హైద్రాబాదు హిందీ ప్రచార సంఘ పక్షమున ఉచిత భోజన సౌకర్యము ఏర్పాటు చేయబడినది ఈ శిబిరము నకుగాను దాదాపు 450 రూపాయలు ఖర్చయినవి

---

*పుస్తక పరిచయము :*

## *రతనాల తండ్రి* (గేయనాటికలు)

రచన : *రంధి సోమరాజు*
పేజీలు 80
వెల ఎనిమిదణాలు

ప్రాప్తిస్థానం : *రచయిత*
C/o Southern Agencies,
Main Road, Eluru.

గానయోగ్యమైనది గేయమనీ, ప్రదర్శన యోగ్యమైనది నాటికయనీ విజ్ఞుల నిర్వచనం. ఐతే ఈ పుస్తకంలోని మూడు నాటికలూ పై నిర్వచనానికి ప్రతికూలంగా ఉన్నాయి. ఇవి కొంతవరకు ప్రదర్శనానికి అనుకూలించితే పదవచ్చు కాని మాటలు ఆయా పాత్రంచేత ఉచ్చరింప బడుతున్నప్పుడు అంతగా రక్తికట్టవు

ఈ పుస్తకంలో హరివిల్లు, పరితాపం, రతనాల తండ్రి అనే మూడు నాటిక లున్నాయి. రచయిత ఆశించినంతగా ఈ నాటికలు రాణించకపోయినా అక్కడక్కడ కొన్ని పాత్రలచేత పలికించిన మాటలు పాఠకునికి కొంత అనుభూతిని కలిగిస్తాయి.

'హరివిల్లు' లో అమ్మాయి పెళ్ళికిముందే గర్భవతి కావడమూ, ఒకవ్యక్తి వియ్యమంద డానికి నిరాకరించడమూ, ఆనక అమ్మాయి గర్భధారణకు కారకుడైన యువకుడువచ్చి పెళ్ళి చేసుకోవడమూ చిత్రించబడ్డాయి. సంబంధానికి వచ్చిన వ్యక్తి వాకిట్లోనే అమ్మాయిని గురించి తెలుసుకుని—

"నియమాల ముళ్ళమధ్య
నిశ్చలంగా బ్రతికే విద్య
తెలిసికోవాలమ్మా"— అని సలహానివ్వడం బాగుంది
"ధనంవల్ల జనం చావరాదని
వంటకవసరమైన మంట ఇల్లు కాల్చరాదనీ
మారణానికవసరమై ధనం
మనుషులను చంపరాదనే జ్ఞానం
మనిషికే ఉండాలి"—అని

అమ్మాయిని ప్రేమించిన యువకుడు వచ్చి తన తండ్రికి ఇచ్చిన సలహాని వివరించడంలో ఆదర్శం ఉంది ఐతే, అమ్మాయి అన్నని చిత్రించడంలో లోపం ఉంది ఆధునిక వాసనల్లో పెరిగిన యువకుణ్ణి, తండ్రిచెల్లెలి తప్పు మన్నించమని అనునయించడం సమంజసంగా లేదు సనాతనుడుగా ఉండాల్సిన తండ్రికి ఆధునిక భావాలూ, ఆధునికుడైన కొడుక్కి పాతవాసనలూ ఉండటం అరుదు సామాన్యమైన మనః ప్రవృత్తుల కళ్ళు గట్టించడం మెఱుగుగా ఉంటుంది.

'పరితాపం' లో ఒకకవి పబ్లిషరుతో తనపుస్తకాన్ని తీసుకుని కూతురు ముద్దుచెల్లించే దేదైనా ఇప్పించమని విలపించడం, పబ్లిషరు అంగీకరించక పోవడం, కవి ఆవేదనతో అక్కడే చనిపోయాక పబ్లిషరు పరితపించడం ఇతివృత్తం "అయ్యా పబ్లిషరుగారూ, నేనే నండి; కవిని, కష్టైవుల్లని, మీరు కరుణిస్తే మరణించేముందు ఒక్కమాట "— అని కవి గారి ఆవేదన్ను చక్కగా చిత్రించాడు "ఈ అనంత విశ్వంలో, ఈ రాత్రీపగలు, ఈవెనింగ్ మార్నింగ్ న్యూస్ పేపర్లలాగ తెగ ప్రింటయి పోతూంటే, ఎక్కణ్ణుంచి తెచ్చిపెట్టను డబ్బు? కొనేవారేరీ నన్ను తినేసేవారేగానీ" అన్న పబ్లిషరు మాటలు సమంజసంగానే తోస్తాయి అంతమాత్రాన "పబ్లిషర్ల నక్క వినయాలనుంచి తప్పించుకునే మార్గం నా చేతి లోనేఉంది కాని నిన్ను మాత్రం విడిచిపెట్టను నిన్ను జెంగలాగ చుట్టుకుంటాను, నిన్ను అప్పులాగ వెంటాడుతాను " అనడంలో ఔచిత్యం లేదు, కేవలం మాటల సౌష్ఠవం తప్ప.

చివరినాటిక "రతనాలతండ్రి" ఆర్థిక ఇబ్బందులవల్ల పైచదువు చదువలేక కుటుంబ భారాన్ని మోయడానికి ఉద్యోగాని కంగీకరించిన యువకుడి చిత్రణ. రచయిత స్వంతశైలిని ఒకదాన్ని వెతుక్కుని, కథలకూర్పులోనూ భావవ్యక్తీకరణలోనూ ప్రత్యేకత నిలబెట్టుకోవ డానికి ప్రయత్నిస్తే ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించి ఎంతైనా రాణించడానికి అవకాశం ఉంది.

—"వల్లపురెడ్డి"

# కృష్ణాంజలి

## (కథానికల సంపుటి)

రచన : శ్రీ కొండి కృష్ణమూర్తి　　　ప్రతులకు
వెల : రూపాయి　　　యశోధర పబ్లికేషన్సు,
హనుమకొండ, వరంగల్.

ఈ సంపుటిలో 12 రచన లున్నవి.

'విష్కామకర్మ'లో - ఒక ఇన్సూరెన్సు ఏజంటు రైల్లో— ప్రయాణంచేస్తూ తాను జవ గామ రైలు ప్రమాదంలో ఎలా బ్రతికిందీ తెలుపుతూ నిజంగా తాను చనిపోతే కుటుంబానికి దిక్కేమిటనే బాధతో వెంటనే ఇన్సూర్ చేయించి, ఎలా ఏజంటయిందీ వెల్లడిస్తాడు. అందర్నీ ఇన్సూర్ చేయమని సలహా ఇస్తూ ఆ సూచన తన స్వార్థానికి కాదంటాడు.

ఈ కథలో చిట్టచివరన అతను ఏజంటని తేలిపోయి అంతటితో కథ వెంటనే ఆగి పోతే చాలా బాగుండేది ఇక అతను ఏజంటని తెలిశాక కథ నడవడం అంత పట్టుగాలేదు.

'గింజలు మిగిలాయి'లో తనభార్య ఎంతో మంచిదని విశ్వసించిన దాలయ్య - ఆమె మెకానిక్ తో లేచిపోయిందని విన్నాక 'గింజలు మిగిలాయి' అనడం అతనిపాత్ర పోషణకు విరుద్ధ మనిపించింది.

'వివాహిత'- చిత్రమైన కథగావుంది. కృష్ణప్రసాద్ చిన్నప్పుడు తా నమకున్న ప్రభా వతిని పెళ్ళాడలేకపోతాడు. తీరా అతను పెళ్ళి చేసుకుందా మనుకునేసరికి ప్రభావతి వితంతు వవుతుంది శరణాలయంలో ఆవిడను చూస్తాడు. అయితే ఇతన్ని చూడగానే ఆమె శరణా లయం వదలిపోతుంది. ఎలాగో కల్సుకొని కృష్ణప్రసాద్ ఆమెను పెళ్ళాడ్తారు అయితే "ఆ రాత్రి ప్రభావతి అతనిచేత చేతిలో చెయ్యి వేయించుకున్న విషయం ఎవ్వరికీ తెలియదు— ఆమెకీ, అతనికీ తప్ప అనాదే ఆమె వివాహిత" అని అనిపించారు.

మరి - నిజంగా ఇదే ఇష్టమైన వివాహమని అలా అనిపించారో లేక అసలు ఆమెకు ముందే పెళ్ళి కాలేదో తెలియదు. పెళ్ళి కాలేదనటానికి అవకాశంలేదు. ఎందుకంటే - ఆవిష యంలో ఎంతో కథ నడచింది. అయితే - శరణాలయంలో కృష్ణప్రసాద్ కనబడగానే ఆమె ఎందుకు పారిపోవలసివచ్చిందో అర్థంకాదు

'సమస్య తీరింది'లో ప్రముఖ సమస్యను పరిష్కరించడాని కొక మార్గం చూపారు. ఆడపిల్లలను కన్నతండ్రి - వాళ్ళకు కట్నాలతో పెళ్ళిళ్ళు చేయలేక ఒక ఎత్తు ఎత్తుతాడు. ఆ వూళ్ళోనేవున్న బ్రహ్మచారియైన ఐదివంతులను ట్యూషన్ కు కుదిర్చి - అతను తన పెద్ద కూతురును లేవదీసుకుపోయ్యే అవకాశాలు కల్పించి ఆఖరున పెళ్ళిచేస్తారు. కట్నాల సమస్య తీరడానికి తల్లిదండ్రులు ఈ టెక్నిక్ ను అవలంబిస్తా రనడం, అవలంబించడం ఎంతవరకు సహజం, సమంజసమో మరి!

'వేసవి పగలు'లో అప్పుతీర్చడానికి సీతయ్య మిట్ట మధ్యాహ్నం రిక్షాలాగి అలసి చెట్టుకింద పడుకుంటాడు తిరాలేచి చూచేవరకు లారీ గుద్దుకొని రిక్షాచక్రం వూడివట్టు కవిపిస్తుంది అప్పుడనుకుంటాడు, ఈ రిక్షా జీవితం వద్దు, పల్లెటూరి కూలే నయమని ఈ కథలో రిక్షావృత్తిని భయంకరమైందిగా చిత్రించ దలచుకుంటే ఆ పని నెరవేరలేదనాలి

'చరిత్ర పునరావృత మవదు' అనేది కథ అనిపించుకోదు ఒకని అనుభవంలో చెప్పుకోదగ్గ ప్రత్యేకతకూడా లేదు - శీర్షిక కోసం విషయాన్ని మలుపుకోవడంతప్ప తక్కువ కులంవాడు కనుక తననెవరూ సరిగా చూడరని వాదించే కేశవరావును బ్రాహ్మణ అమ్మాయి ప్రేమించి పెళ్ళాడి 'చరిత్ర పునరావృత' మవకుండా తోడ్పడుతుంది

'కుమార సంభవమ్'లో తనను రెండేండ్లపాటు ప్రేమగా చూసుకున్న భర్త మధ్యలో మరోలా ప్రవర్తించడం సహించలేని శారద - తిరిగి భర్త ప్రేమకోసం పిల్లవాణ్ణి కనికూడా ఆ ప్రేమను సంపాదించుకోలేంపోతుంది కొడుకెందుకు పుట్టినట్టని దుఃఖిస్తూ కూచుంటుంది.

ఇందులో భర్తనుంచి శారద నిజంగా కోరేదేమిటో అర్థంకాదు పైగా - పిల్లవాడు కలిగితే భర్త బంధింపబడ్తాడని రత్తమ్మపిన్ని సలహా చెప్పగానే శారద నెలతప్పడం చిత్రం

'శ్రీదేవి'- మిల్లుయజమాని అందాల భార్య ఎన్నడూ పరాయి మొగాడితో మాట్లాడి ఎరుగదు అయినా - మొట్టమొదటిసారే సరికొత్త గుమస్తా సంజీవరావును చూసి మహా పరిచయంగా మాట్లాడి సంబంధాన్ని ఏర్పరచుకుంటుంది చివరకు తాను భర్త కన్యాయం చేశానని తెలుసుకొని కాశీకి వెళ్ళిపోతుంది.

'పాలరాళ్ళ ప్రేమచిహ్నం'లో- తాజ్‌మహల్ ముంతాజ్ ప్రేమ చిహ్నంగాగాక, వేలాది కార్మికుల కష్టఫలంగా చూడమంటున్నారు.

'నిరీక్షణ' చక్కని చిన్నకథ ఒకామె రెండేండ్లనుంచి రోజూ టపాకోసం పోస్టాఫీసు కొస్తుంటుంది ఎలక్షన్లో ఓటు చేసినప్పుడు ఎవరో మనియార్డరు పంపుతామన్నారట దాని కోసం నిరీక్షణ చక్కగావుంది

'వెలుగు నీడలు' - స్వగతమనాలి. యుద్ధ మయిపొయ్యాక ఒకతని వూహలు వర్ణింపబడ్డవి

'భాగ్యనగర్'లో మహమ్మద్ కులీ కుతుబ్‌షా భాగ్యవతి అనే యువతిని ఎలా ప్రేమించి, పెళ్ళాడి, పట్టమహిషిని చేసిందీ చరిత్రాధారంతో కథ అల్లారు. ఆమెపేరుతో తయారైన నగరమే హైదరాబాదు,

మొత్తమ్మీద ఈ కథలలో శిల్పంలేదు సరిగదా। ఇవి అసంతృప్తికరంగా వున్నాయనాలి.

—'కోలన్'



# హృదయేశ్వరి


రచన ప్రచురణ :

శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి సాహితీ సమితి - రేపల్లె.

వెల రూపాయిన్నర


శ్రీ శివశంకరశాస్త్రిగారు సాహితీ సమితి సభాపతులుగా, భారతీయ విదేశీయ భాషలలో, శిల్పచిత్రాది లలితకళలలో, అలంకారాది శాస్త్రములలో, వివిధ దర్శనములలో, కృషిచేసిన విజ్ఞులుగా ఆంధ్రసాహిత్య లోకమునకు చిరపరిచితులు ఆత్మాశ్రయ కవిత్వమునకు తెలుగు నాట బాట్లువేసిన కొలదిమంది కవులలో శ్రీ శాస్త్రిగారు గణనీయులు. భావకవిత్వ శాఖకు ప్రాతినిధ్యము వహించిన అయిదు, పది ఖండకావ్య సంపుటులలో 'హృదయేశ్వరి' ఒకటి. 'హదయేశ్వరి' ప్రథమ ముద్రణము జరిగి కొన్ని అబ్దములు గడచినవి. మరల 1954 లో దాని 'పరివర్ధిత పరిష్కృత పరిపూర్ణ పాఠము' ప్రచురితమైనది

ఈ కావ్యములోని నాయిక లక్ష్మి పదాంకిత నాయకుడు కవియే. అతని హృదయేశ్వరి కేవలము ప్రణయినికాదు ప్రణయదేవి కమలగర్భుని కంఠ శృంగాటకమున చెలగు వాగ్దేవి. 'కమనీయనవ్యగాత్రలతిక గైకొన్న భాగ్యలక్ష్మి' ఏ పట్టునను అశ్లీల స్ఫురణకు తావులేని విప్రలంభశృంగారము ఏతత్కావ్యమున పరిపుష్టమైనది

వన్నెయలోని 'అక్షర రమ్యత' శాస్త్రిగారి ప్రతిపద్యములో ప్రస్ఫుటముగా కన్పించును.

'స్ఫిత గండస్థల ప్రతిబింబితాచ్ఛ
దివ్య తాటంక యుగళ సందీప్తవదన
మండలమ్ము వెలింగెను మదనదేవు
రమ్యచైత్ర చతుశ్చక్ర రథమువోలె.'

ఈదృశములైన పద్యములు శాస్త్రిగారి మధుర ప్రౌఢ పద్య రచనా పటిష్ఠతకు మచ్చుతునకలు

శాస్త్రిగారు క్వాచిత్కముగా తెలుగు పదములను, పలుకుబడులను ప్రయోగింతురు. వీరి శైలిలో అత్యధికభాగము తత్సమపద విష్టమే. అయితే వీరు ప్రయోగించిన సంస్కృత సమాసములన్నియు సమర్థములు, శక్తిమంతములు 'మామకీన స్వరాశ్రువ్యమాణవు', 'తరణి కిరణ ప్రభాస్ఫుష్టతమము' 'ప్రమదఘంటాళ కాలరూపములు' ఇత్యాదు లిందుకు నిదర్శనములు.

నిత్య వ్యవహృతములైన స్వామాన్య శబ్దములకు మాన్యత కల్పించి కావ్యములో ప్రయోగించినారు శాస్త్రిగారు. ఒకచోట 'ఖందరు కాల్వలోని పీరరేఖను ప్రాపించి కూడుచుంటి' అనిరి. మరియొకచోట 'ఆంగ్ల బాదామఫలరూప హారి' అనిరి. అన్య దేశ్యములను, నిత్య వ్యవహృత శబ్దములను ఒక గభీరభావమును ప్రకటించుటకు సామాన్యముగా కవులు

ప్రయోగించరు. ఇట్టి శబ్దములు ప్రయోగించినచో ఔచిత్యహాని, రసభంగము కలుగునను అభిప్రాయము గూడ సువ్యాప్తము శబ్దప్రయోగ కుశలురైన శాస్త్రిగారి లేఖినీ లాలితములగుట వలన వ్యావహారిక పదములు గూడ రసాస్పదములైనవి.

శాస్త్రిగారు సంప్రదాయసిద్ధమైన వర్ణనలతోపాటు వినూత్నకల్పనలుగూడ చేయుదురు. అతని ప్రణయదేవి కైశికము 'వాసవమణిద్యుతిచ్ఛటా భాసుర' మనిరి 'చిక్కణతమాల దీధితి స్నిగ్ధ'మని పొగడిరి. ఇంతవరకు క్రొత్తదన మేమియు కన్పించదు తరువాతి పంక్తి 'ఆ కళిందసుతాతరంగాభిరామము. - దీనిలోని కల్పన వినూత్నము, అభిరమ్యము

'వక్తవ్యము' లో శాస్త్రిగారు వ్రాసినట్లు "స్వాదుపరాఙ్ముఖులు కానివారెల్లరును కావ్య పఠనయోగ్యులు అయినను మహాకవిమార్గగాములు, పద్య గ్రథన రహస్యవేత్తలు, ప్రాక్ప్రతీచీ సాహిత్య సమీక్షదక్షులు, కామకలాప్రవీణులు, ఆరోగ్యవంతులు నగు ఆర్ద్రహృదయులే స్వారస్య నిర్ణాయకులు" పైవారే 'హృదయేశ్వరి' కావ్యరసాస్వాదన సమర్థులు. ఉపరి ప్రోక్తములైన అంశములలో ఏది లోపించినను ఈ కావ్యపఠనము వలన సమగ్రమైన రసానందము కలుగదు

—'సింహేంద్ర'

# పునర్నవం

శ్రీ దాశరథి గేయాల సంపుటి.

⅛ క్రౌను పైజున 115 పుటలు. దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణ,
వెల రు 1-8-0 హైదరాబాదు.

ఇరవైయేడు శీర్షికలు గల యీ గేయసంపుటికి ప్రకాశకుల "మనవి", గ్రంథకర్త "మననం" తో పాటు, కవి పరిచయమూ, ఫొటోకూడా జతపరచి వేశారు

'మననం' లో కవి స్వగత వచనాలు వారి కవితాప్రకృతికి నిర్వచనాలుగా ఉన్నవి

'కొత్తమాట కాదు గాని క్షోభలోంచే రాస్తుంటాను. క్షోభ లేంది రాయలేను. అది నాకు వరం. వెనక్కి చూడడం రాక, ముందును గూర్చి భీతిలేక, వర్తమానంలో ఇష్టంవచ్చినట్టు చేస్తుంటాను. నష్టపడతాను. ఇహ ఉద్రేక ప్రకృతి' అని ఒక నిర్వచనం.

'ఏదో చెప్పాలనే కోర్కె; చుట్టుప్రక్కల మనుషుల్లో, వాళ్ల క్రియాకలాపాల్లో అసక్తి; కనబడే లోకంలో కనబడని లోకంలో కాంక్ష; ఆకారం మీద అనురాగం, ఈ నాలుగూ గుండెను కవ్వించి కలం చేపట్టిస్తాయి'- అని వారు కలం పట్టడానికి ఆలంబనమైన వస్తువులు పేర్కొన్నారు.

వీరి కవితారచనలో మంచి ఆవేశం ఉంది; ఉద్రేకం ఉంది. మానవత్వం మీద మమత ఉంది ఇవే వీరి చేత యీ ఛందస్సులు వ్రాయించాయి. కవిత చెప్పించాయి.

వీటిలో వెలువడిన భావాలు పరిశీలిస్తే - కవి వాక్యంలోనే ఉదాహరించిన గుణాలే కనిపిస్తాయి అవి అచ్చంగా సొంత అనుభవాలు; ఇతరుల అనుభవాలు. వ్యక్తికి సంఘానికి గల చుట్టరికం, ప్రకృతికీ మనకూ గల పారస్పరిక బాంధవం. నవసృష్టి కోసం కృషి; ఈ అయిదూ కవితా సౌధరచనకు వాస్తుశాస్త్రంలో తోడ్పడతాయి."

"అమృతానికి ఆమ్రేడితం కవిత్వం" అనీ "కవిత్వం మనస్సుల్ని అతుకుతుంది" అనీ కవి విశ్వాసం. అందుకే - 'ఇక్కడ అకాలంలో నైనా వసంతం వచ్చి చివుళ్లెత్తుతుంది' అంటాడు. 'ఇక్కడ అంతరాల్లో పునః నవత్వం మొగ్గ తొడుగుతుంది' అంటాడు. అందుకే 'పునర్నవం' అని తన కవితా వధువుకు నామకరణం చేసుకొన్నాడు

ఈ సంపుటంలో వెలువడిన ఛందస్సులు - అనేక పత్రికలలో ఇదివరకు వెలువడినవే. ఎక్కువ భాగం - సమకాలిక సమస్యల గురించి, జరుగుతున్న చరిత్ర గూర్చి వ్యాఖ్యలుగా వెలువడిన పద్యరచనలు ఇవి గేయాలు అనడానికి వీలులేదు పాడుకోవడానికి వీలైనవాటినే గేయాలు అనవచ్చు కొన్ని మాత్రాచ్ఛందస్సులలోను, కొన్ని స్వేచ్ఛాఛందస్సులోను ఉన్నప్పటికీ వీటిని గేయాలు అనేకంటె, ఛందస్సులనడం సముచితమేమో। ఇవి ఆ యా సమయాలలో జరిగిన అంశాలమీద వ్యాఖ్యలు అవడం చేత - ఒక్కొక్క రచన చేసిన తేదీ ఆ రచనక్రింద వేస్తే అప్పటి సమకాలీన పరిస్థితులు అవగాహన చేసుకోవడానికి వీలయ్యేది. రెండవ ముద్రణలో - ఈ చేర్పు చేస్తే బాగా ఉంటుంది

కొన్ని కొన్ని రచనల్లో, శ్రీశ్రీ ప్రభావం కనిపిస్తోంది 'బాల్యం' అనే రచనలోనూ, 'మస్తిష్కంలో లేబొరేటరీ' 'అశ్రుదీపం' వీటిలోనూ 'శ్రీశ్రీ' పంక్తుల ప్రతిధ్వనులు వినిపిస్తున్నాయి. ఈ రచనల్లో కొన్ని కవి గొంతు సరిచేసుకొని గుండె శ్రుతి చేసికొని కవితా గానానికి ఉపక్రమించే కొత్తలో చేసినవని స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ కొత్తలోంచి బయలువెడలి కవి తన కంఠాన్ని విప్పి పాడిన తర్వాత, తన వ్యక్తిత్వాన్ని చాటుకొన్నాడు.

" గతాన్ని కాదనలేను
వర్తమానం వద్దనలేను
భవిష్యత్తు వదలుకోను
కాలం నా కంఠమాల
నా పేరు ప్రజాకోటి
నా ఊరు ప్రజావాటి " ఇదీ యీ కవి దీక్ష।

సురవరం ప్రతాపరెడ్డి గారిని గూర్చి వ్రాసిన అశ్రుగీతంలో ఈ కవి భావస్ఫూర్తి వికసించింది.

"ఒకనాటి నిశీథంలో
ఊదినాడు స్ఫులింగాలు

జ్వాలా జిహ్వలతో అవి
వ్యాపించె నన్ని రంగాలు."

ఈ గ్రంథనామ మయిన రచన 'పునర్నవమ్'లో వీరి కవితాశయాలు వెల్లడించారు 'ముసలి మోహం పడిన వృక్షంమీద యౌవనం చిగిరించడం, 'ఆకాశమంత యెత్తు కోర్కెలను అథః పాతాళంలోకి తొక్కి లోకాన్ని అమాంతం మింగేయగల శక్తిని అర్జించడం' 'ఎత్తయిన ఆకాశైలం నెత్తమ్ములచెంత నిలిచి పద్యాల పావురాళ్ళని బహుదిశల్లోకి విసరడం' - వీరికి పునర్నవంగా కనిపిస్తుంది. సున్నితమైన భావాలను, సుకోమలమైన పదాలలో ఇముడించే కవి ప్రజ్ఞ 'అచుంబితం' వంటి రచనల్లో పంక్తిపంక్తిలోనూ పరిపుష్టమై యుంది.

మాట్లాడని మల్లెమొగ్గ
మాదిరిగా నడచిరా
నిశ్శబ్దం ఎరుగనట్టి
నిమ్న గనకె నడచి పో : అని ఆహ్వానిస్తున్నారు.

ఈ కవికి భాషమీద, భావంమీద, శబ్దచిత్రాలమీద మంచి అధికారం ఉంది, కనుక - కొన్ని విదేశీపదాలు వాడి, వీటిచేత తీయనైన తేటతెనుగును గాటుపరచ నవసరంలేదు. స్వేచ్ఛా ఛందస్సులు, గద్యపద్య రచనలూ చేయడంలో 'దాశరథి' చేసిన ప్రయోగాలు ఒకచోట చూడటానికి ఈ సంపుటం ఉపకరిస్తుంది. పునర్నవమ్—నిజంగా పునః నవమే :

# క్షీర బిందువు

## నేరెళ్ళ సాంబమూర్తి (తొలిరచన)

¼ క్రౌన్ సైజులో 32 పుటల పద్యసంపుటి వెల అరణాలు.

వలయువారు గ్రంథకర్త పేరున శట్టిప్రోలు వ్రాయవచ్చు

ఈ పుస్తక పరిచయం కొత్త సత్యనారాయణ చౌదరిగారు చేస్తూ వ్రాసిన వాక్యం పరిశీలింపదగింది. 'దిక్సూచికముగా మెఱుగులు గుబాళింపనేర్చిన- ఈ రచనను అవలంబముగా జేసికొని ఇతోధికముగా ఈ గ్రంథకర్త రాణింపగలడని యాశింతును.' కాశీ కృష్ణాచార్యులు, దోమా వెంకటస్వామిగుప్త, తడికమళ్ళ కోటేశ్వరగుప్త గార్ల పద్యాల్లో ఆశీర్వచనాలు చేశారు. తర్వాత కవిగారి అంకిత పద్యం, కృతికర్త ఫోటో, ఇంకా ఇష్ట దేవతాస్తుతి మొదలయినవి ఉన్నాయి. ఇవన్నీ ఛందోబద్ధమైన సీసపద్యాలతో, గీతపద్యాలతో కూర్చినవితప్ప వీటిలో రససిద్ధిగల భావరచన ఒక్కటీ కనిపించదు. 'హంపి' గూర్చి, 'అజంతా-ఎల్లోరాలు' గురించీ వీరు వ్రాసిన పద్యాలు కొడాలివారి పద్యాలను, జాషువాగారి పద్యాలను జ్ఞాపకం చేస్తున్నవి. 'శిశువు' గూర్చి చెప్పిన పద్యాలలో

'అటమిక్ బాంబు' బెదరింపు లణగిపోయె
'హైడ్రొజన్ బాంబు' బెదరింపు లద్దుకగిలె
మానవావళి శాంతియు మంటగలిసె
విదురపోవోయి యోబిడ్డ ; కుదురుగాను'- అన్నారు

ఇందలి ఔచిత్యం ఏమిటోమరి ; ఈ రచనలో 'ఎవరెస్టు', 'జెన్సింగు', 'హిల్లారి', 'నెహ్రూ రష్యాయాత్ర' కొంటివంటివాని ప్రసక్తి తెచ్చారు - చంటిపాప లాలిపాటలో యిలాంటి భావాలు పొదగడంలోని ప్రయోజనం కవిగారికే తెలియాలి ఈ పుస్తకం చివర 'పెట్టెవాగులు' అనే శీర్షికలో చిన్న పద్యకథ ఉంది వీటిలో చంద్రుణ్ణిజూచి ఎట్టుకోబోయిన కొందరు వీటిలో మునిగిరి యంతలోన అనిచెప్పి

వింటు చూలాలి శేకంబు పండువరెను
వారికప్పుడు దొరికెను వాలుగాను
పెట్టెతవమని దానిని విడిచి యాక
సంబునను జూచి రక్తతిః జంద్రమునుని- అని ముగిస్తారు.

కవితా పారాల్లో ఓనమాలు దిద్దుకొంటున్నప్పుడు యీ కవివంటివారు ఇలాంటి తమ తొలిరచనలు అచ్చువేసుకోవడంలో ఆత్మానందం వినా ప్రయోజనం ఏమిటోమరి ;

# దా మో ద రీ య ము

¼ క్రౌను సైజు 38 పేజీలు వెల పావలా

ప్రకాశకులు : శేషీ ప్రచురణలు - ఏలూరు.

'అనంతం' అనే కవి సంకల్ప మాత్రంచేత అవిర్భవించిన మానవిక పుత్రిక యీ శతకం - ఇందులో 128 పద్యాలున్నవి

ఇవి వివిధ వృత్తాలలో నడిచి వ్యాజస్తుతి ప్రధానంగా పెట్టుకొన్నవి.

'విను నన్నింపగ కోర్కెతక్క తగు పాండిత్యమ్ము లేకున్కి ఇం
దున వ్యాజస్తుతి సేయుచో దొరలియుండున్ దోసముల్, వాని దా
నువి కవ్వుల్ పరి యొక్క దండమున వన్ మాత్రాన బోద్రోచి వ
న్నమృతంపామృత వృష్టి ముంపగదరా నాతండ్రి ; దామోదరా ;

ఈ రచయితకు చక్కని ధార ఉంది అందులో చమత్కారమూ ఉన్నది. అందుకే శతక లక్షణంలో నడిచిన యీ రచన జాతీయాలతో, ఉక్తిచమత్కృతులతో, సముచిత వ్యాఖ్యలతో సహృదయరంజకంగా ఉంది.

సకల క్ష్మాపరిపాలన క్షమ మనీషా సద్య దాణక్యు డో
క్కొంత దాంధ్రమ్మున నున్న నాయకు డటయ్యూవ్ నేరు నాయాంధ్రకా

తికి లేదయ్యెను రాజకీయముగ మర్దిపిందు విఖ్యాతి. దీ
నికి నర్ధంకుల నొత్తిగించి దయరాపీ మంత దామోదరా !
దామోదర మకుటం గల యీ శతకానికి 'దామోదరీయం' అని పేరు పెట్టారు.

# గుచ్చుకోని ముళ్లు

( ఏడు చిన్న కథల పుస్తకం )

⅛ క్రౌను సైజులో 45 పుటలు — రచన

వెల పావలా — నాయుడు వేంకట సీతారామమూర్తి

ఆలమూరు, తూర్పు గోదావరి జిల్లా.

ఈ కథలన్నీ 'జనవాక్యం' అనే పత్రికలో ఇదివరకు వచ్చినవేనట పత్రికలో తాత్కాలికంగా చదువుకోవడానికి వీలైన ఈ కథలు పుస్తకరూపం దాల్చవలసిన విశిష్టత వందుకోలేదు ఈ కథల్లో, ప్రతిదాంట్లో రచయిత ఒక నీతి చెప్పడానికి ప్రయత్నించాడు. భర్తలను అనుమానించే భార్యల గురించీ, బ్రాకెట్ల ఆటలోని నష్టాల గురించీ యీ కథకుడు మంచి కథలే వ్రాశాడు ఏ కథ అయినా ఉత్సుకత కలిగించేటట్టు చెప్పే నేర్పు ఈ రచయితలో ఉంది కాని కథా సంవిధానం నడపడంలో గాని, పాత్రచిత్రణలో గాని, సంభాషణల్లో గాని, విషయ నిర్దేశంలో గాని బిగువుతెచ్చే నేర్పులేదు ఇంకా బాగా సాధకంచేస్తే తప్ప యీ రచయిత తన కథలు అచ్చుకి తేకుండా ఉంటే - మంచికథలు వ్రాయగలడేమో, ఇటువంటి ఉత్సాహవంతులయిన కథకులు ఎవరైనా తెలిసిన మంచి కథకుల వద్దగాని, విమర్శకుల వద్ద గాని కథా రచనావిధానం 'టెక్నిక్' నేర్చుకుంటే మంచి కథకులు కాగలరు కాని అటువంటి ప్రయత్నం చేయకుండానే గ్రంథకర్తలై పోతున్నారు అదీ ప్రమాదం !

# వాఘిరా

( అజంతా గుహల వాతావరణంలో కల్పించిన నవల )

⅛ క్రౌను సైజున 128 పేజీలు — రచన

వెల ఒక రూపాయి — నోరి నరసింహశాస్త్రి

దొరకుచోటు నోరివారు, రేపల్లె.

చారిత్రక నవలలు వ్రాయుటలో చేయి తిరిగిన నోరివారు, అజంతా గుహారామములలో జరిగినట్లూహించి ఈ కథ అల్లినారు. అజంతా వద్ద ప్రవహించే నది 'వాఘిరా' పేరుతో- అది సార్థకమగునట్లు పులి పిల్లవంటి ఒక బాలికను సృష్టిచేసి ఆమె ప్రణయగాథను ఇతివృత్తముగా తీసికొన్నారు. ఈ బాలికను ప్రేమించు 'కౌండన' అను చిత్రకారుని జనపదధి వారి

ప్రణయము, దాని అభావ వర్ణించినారు ఈ కథ కొంతవరకు మల్లీశ్వరి చిత్రగాథను జ్ఞాపకము చేయుచున్నది. ఇందు కథానాయిక ఒక అల్లరిపిల్ల, దిక్కు మొక్కులేని అనాథ. ఆమెను ప్రేమించిన యువకుడు కొండప చిత్రకారుడు చిన్ననాటి చెలిమిని ప్రణయముగా రూపొందించుకొన్నాడు 'వాఘిరా' అజంతా గుహలలో బౌద్ధాచార్యుడు కుమార శ్రీనాథుని పోషణలో పెరిగిన అనాథబాలిక ఆమెను పులకేశిరాజుచూచి తన అంతఃపురములో తెచ్చిపెట్టుకొన్నాడు 'కొండప' ఆమెను పోగొట్టుకొని రాచనగరు చేరి ఆమెను తిరిగి సంపాదింప ప్రయత్నించినాడు. ఈ ప్రయత్నములో రాజద్రోహము చేసినాడు శ్రీహర్షునికి తన రాజునకు జరిగిన యుద్ధములో, తాను సేనాపతిగాకుండి వైరిమూకలో కలిసినాడు చివరికి ఓడిపోయి, బందీ అయి పరువు కోల్పోయినాడు 'వాఘిరా' కొండపై నుండి నేలకురికి ప్రాణములు తీసుకొన్నది ఆమెతో పాటు అతడును. ఈ కథను - 115 పుటలలో ఇముడించి, పాఠ్య పుస్తకముగా చేయించుకోవలెనను కాంక్షతో- ఏమో - రచయిత చాల కుదించినారు ఎక్కడను శిల్పము చూపలేదు ఒక్కొకచోట ఇది చరిత్రవలెను, మరొకచోట ఉపన్యాసము వలెను నడచినది చరిత్రాత్మక నవలకు ప్రధానమైన తత్కాల వాతావరణము తెచ్చు ప్రయత్నము ఎక్కడను లేదు ఏదో కథ, ఎలాగో చెప్పివేయవలెను అను ధ్యానతప్ప. అది సర్వాంగ సుందరముగా చేయవలెనను శ్రద్ధ రచయిత చూపలేదు ఈ కథ జరిగిన స్థలము 16వ గుహ. అది వచ్చిన కాలము పులకేశి, హర్షవర్ధనుడు, మహేంద్రవర్మ వీరి సమకాలీన చరిత్రను చూపుట, ఎంతవరకు సముచితమో చరిత్రకారులు చెప్పవలయును. ఈ కథ చదివి డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు ఆనందించినారని రచయిత పరిచయములో చెప్పుకొన్నారు. విద్యార్థులకు, పాఠకులకు అజంతా సంఘారామము జీవద్దశ హృదయములలో గొంతవరకైన హత్తుకొన చేయగల్గినచో తన ప్రయత్నము కృతార్థమైనట్లు పరిగణింతునని రచయిత అన్నారు ఈ కథ పూర్తిగా చదివిన తరువాత వీరి ప్రయత్నము విఫలమైనదని పాఠకులు చెప్పక తప్పదు దీనిని పాఠ్యగ్రంథముగా చేయవలెనను కోరికకంటె ఉత్తమ చారిత్రిక నవలగా వ్రాయు ప్రయత్నము రచయిత కనబరచినచో అది నెరవేరి యుండునేమో ? ఈ కథకు మూలాధారమైన 'పద్మపాణి బుద్ధుని' అజంతా చిత్రములో మలచిన వల్లపిల్ల బొమ్మ వేసియుండవలసినది ముఖపత్రముగా వేసిన రేఖాచిత్రం లోని బీభత్సదృశ్యముకంటె ఏ బొమ్మయు లేకున్న యీ పుస్తకము కన్నుల కింపుగా నుండెడిదేమో. 'నారాయణభట్టు' 'రుద్రమదేవి' రచించిన నవలాకర్త కలమునుండి ఇటువంటి రచన వచ్చుట ఏ పాఠకుని కైనను ఆశాభంగము కలిగింపక మానదు

—'శ్రీ వాత్సవ'





అర్ధవృత్త పద్మబంధము

—అమరావతి



శిల్ప తోరణము

—అమరావతి

# హైదరాబాదు హిందీ ప్రచారసంఘము

## 1956 జనవరినుండి మే చివరి వరకు చేరిన సంఘసభ్యులు.

### యావజ్జీవిత సభ్యులు రూ 250-0-0

| | | |
|---|---|---|
| 1 | శ్రీ బాలకృష్ణ లాహోటే | హైదరాబాదు |
| 2 | శ్రీ యస్. వి యస్ వేంకటాచార్యులు | సికిందరాబాదు |
| 3 | శ్రీ గోలి ఈశ్వరయ్య | సికిందరాబాదు |

### సాధారణ సభ్యులు రూ 10-0-0

| | | |
|---|---|---|
| 1 | శ్రీ ఆం శంకరయ్య | హైదరాబాదు |
| 2 | శ్రీ మధుసూదన చతుర్వేది | .. |
| 3 | శ్రీ ఇల్లింపల రామచంద్రరావు | .. |
| 4 | శ్రీ పి సత్యనారాయణ రెడ్డి | .. |
| 5 | శ్రీ జగమోహన్‌లాల్ చతుర్వేది | .. |
| 6 | శ్రీ వేమూరి ఆంజనేయశర్మ | .. |
| 7 | శ్రీ గౌ॥ జి యస్ మేలుకోటే | .. |
| 8 | శ్రీ రామకృష్ణ ధూత్ | .. |
| 9 | శ్రీ జె కె ప్రాణేశాచార్య | .. |
| 10 | శ్రీ కీర్తిచంద్ చౌధరీ | .. |
| 11 | శ్రీ జ్ఞానచంద్ చౌధరీ | .. |
| 12 | శ్రీ ఎడిమ్ఎండ్ చౌధరీ | .. |
| 13 | శ్రీ వాబూలాల్ పాటోడీ | .. |
| 14 | శ్రీ ఆర్యేంద్రశర్మ | .. |
| 15 | శ్రీ తేజనారాయణ్‌లాల్ | .. |
| 16 | శ్రీ లోకర్బ్‌లాల్ కవాడియా | .. |
| 17 | శ్రీ తూము రంగారావు | .. |
| 18 | శ్రీ కాశీ చరణ్ గుప్త | .. |
| 19 | శ్రీ డాక్టర్ బాలకృష్ణ | .. |
| 20 | శ్రీ మునీంద్ర | .. |
| 21 | శ్రీ రాధాకృష్ణ జోషీ | సికిందరాబాదు |
| 22 | శ్రీ రమణలాల్ కడాకియా | .. |
| 23 | శ్రీ దాచేపల్లి కృష్ణయ్య | .. |
| 24 | శ్రీ యం లాల్‌మణి | .. |
| 25 | శ్రీ పి నారాయణ | .. |
| 26 | శ్రీ ఏ రంగపాండు | .. |
| 27 | శ్రీ వి జె వీరేశం | .. |
| 28 | శ్రీ బెద్ది జగదీశ్వరయ్య | .. |
| 29 | శ్రీ జూలూరి వీరేశం | .. |
| 30 | శ్రీ జూలూరి జగదీశ్వరయ్య | .. |
| 31. | శ్రీ గుంటుపల్లి రాజగోపాలం | సూర్యాపేట |
| 32 | శ్రీ యరసాని వెంకట వరదారెడ్డి | తల్లంపాడు |
| 33. | శ్రీ చతుర్వేదుల సీతారామయ్య | ఖమ్మంమెట్టు |
| 34 | శ్రీ సోమనాథ్ | గుల్బర్గా |
| 35 | శ్రీ వేమూరి నరసింహశర్మ | జనగామ |

